# కథాకుసుమాంజలి

:: గ్రంథకర్త ::


కోటమర్తి నాగేశ్వరశర్మ

ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు,

స్టాన్లీ బాలికోన్నత పాఠశాలం,

హైదరాబాదు.





ప్రకాశకులు :

చందా నారాయణ శ్రేష్ఠి,

బుక్ సెల్లర్ అండ్ పబ్లిషర్,

జనరల్ బజార్ :: సికింద్రాబాద్.





1952

[ వెల రు 1-0-0

౩ వ కూర్పు

1952



హక్కుదారుడు:
చంద్రా నారాయణ శాస్త్రి.
పుస్తకముల వ్యాపారము, జనరల్ బజారు, సికింద్రాబాద్

# తొలిపలుకు

పాఠశాల విద్యార్థిజనుల కుపయుక్తమగు నుపవాచకములు మిక్కిలి తక్కువగ నుండుటచే నా యుపాధ్యాయానుభవమును పురస్కరించుకొని ఈ చిన్నికథలపుస్తకమును రచించితిని.

విద్యార్థులకు సులభముగ నర్థమగు శైలినే యవలంబించితిని. వ్యాకరణ నియమముల నంతగ పాటింపక కేవల కథాకథనమునే ముఖ్యముగ జూచితిని.

తెనుగు బోధనభాషగ నేర్పడిన నేటికాలమున నీ మాత్రపు భాషాజ్ఞానము మాధ్యమిక తరగతుల కలవడుట యుక్తమని నా తలంపు.

గ్రంథకర్త.

# విషయసూచిక







# కథా కుసుమాంజలి

## గాంధీమహాత్ముఁడు

శ్రీనిలయ మగు భరతఖండము వేద కాలమునుండియును సత్యము, అహింస యను పరమధర్మముల కాటపట్టు. ఈ పుణ్యభూమియందే లోకమునందంతటను పేరెన్నిక గన్న యుత్తమపురుషులు జన్మించిరి. వారు కాలగర్భమున కలసిపోయినను, వారి ధర్మోపదేశములు నేటికిని ఆచరణమునకు తగినవై యున్నవి. ఎప్పుడెప్పుడు అధర్మము వృద్ధిజెందునో అప్పుడప్పుడు దాని నణచివేసి, ధర్మమును స్థాపించుటకు భగవంతుడు పుట్టుచుండునని పెద్దలు చెప్పుదురు. వారి పుట్టుక లోకకల్యాణమును కలిగించుటకొరకే. అట్టి మహనీయులనే అవతారపురుషులని మనవారు చెప్పుచుందురు. అట్టి యవతార పురుషులలో గాంధీమహాత్ముఁ డొకడు.

మహాత్ముని పూర్తియైనపేరు మోహనదాస్ కరంచంద్ గాంధి. ఇతడు క్రీ॥శ॥ ౧౮౬౯ అక్టోబరు రెండవ తేదీని పోరుబందరున జన్మించెను. తల్లిదండ్రులు సనాతనధర్మముల ననుసరించి జీవించిన పవిత్రమూర్తులు. అట్టివారి గర్భమున

జన్మించుటచేతనే మహాత్ముఁ డుగ్గుపాలతోడనే సమస్తసద్గుణముల నలవఱచుకొనగలిగెను.

తండ్రి కరంచంద్ గాంధి. తల్లి పుత్లీబాయి. కులమున కోమటులు. వీరి యింటిపేరు "గాంధి." కరంచందు రాజకోట సంస్థానమున మంత్రిగా నుండెను. ఉత్తమసతియైన మాత కుమారునకు రామాయణము, మహాభారతమునందలికథలను చక్కఁగ నూరిపోసెను. చిన్ననాటినుండియే మహాత్మునకు వీరులచరిత్రముల వినుటయందాసక్తి మిక్కుటముగ నుండెను. రామునిపితృభక్తి; లక్ష్మణుని సోదరభక్తి మహాత్ముని హృదయమున నాటుకొనెను. భారతకథలలోని యుత్తమ ధర్మములన్నియు గాంధీజీమనసున కాపుర ముండెను.

రాజకోటలోనే గాంధిజీ విద్యాభ్యాసము నారంభించి ఉపాధ్యాయులమనస్సున కెక్కునట్లు చదువ నారంభించెను. పాఠశాలజీవితమున నితడు తోటిబాలురకు నాదర్శప్రాయుడుగ నుండెను. పరిహాసమునకైన నబద్ధమాడి యెఱుగడు. పూవుపుట్టినతోడనే పరిమళమబ్బినట్లు సజ్జనులకు సద్గుణములు నట్లే యేర్పడునుగదా! ఆయన సత్యప్రియత్వమున కొక నిదర్శనము కలదు. గాంధిజీ చిన్నతరగతులలోనుండ నొకనాడు పరీక్షాధికారి వచ్చి బాలురను ఆంగ్లేయభాషలో పరీక్షించెను. ఆ సందర్భమున ఉక్తలేఖనము చేయుచుండ నొకతప్పు వచ్చె

ను. పరీక్షాధికారి చూడకుండ, ఉపాధ్యాయుడు తప్పును దిద్దు కొనునట్లు సరియైన గుణింతము చెప్పెను. కాని, గాంధిజీ గురువుగారు చెప్పినను, తప్పుపని యని, తనతప్పును దిద్దుకొన లేదు. బుద్ధిమంతు లగువారు కూడనిపనిని, పెద్దలు చెప్పినను చేయరు. తనకు తక్కువగుణములు వచ్చుటకైనను నంగీకరిం చెనుకాని దొంగపనిచేయుట కొప్పుకొనలేదు. విద్యార్థిదశ యందు తగిన బహుమతులను పొందుచుండినను విద్యాగర్వ మునుమాత్రము పొందలేదు. బాగుపడువారికి విద్యాగర్వ ముండదు. గాంధిజీ మాతృభాష యగు గుజరాతీ భాషను బాగుగా నేర్చుకొనెను. సంస్కృతమునుకూడ కొలదిగ నేర్చు కొనెను. క్రమముగ ప్రవేశపరీక్షయందు కృతార్థు డయ్యెను. పదిరెండవయేటనే "కస్తూరీబాయి" అను శీలవతిని వివాహ మాడెను.

ప్రవేశపరీక్షయం దుత్తీర్ణు డైనపిదప నాంగ్ల దేశమున కేగి న్యాయశాస్త్రమును నేర్చుకొన దలచెను. తన కోరికను తల్లి కెఱింగించెను. కుమారు డధికవిద్యావంతు డగుట తల్లి కభిమత మైనను, ఆనాటిపరిస్థితులు కొన్ని సనాతనధర్మపరా యణయగు తల్లికి, కుమారు ననుమతించుట కడ్డుపెట్టెను. ఆ నాడు విద్యాభ్యాసమునకై ఖండాంతరముల కేగినవారిలో పక్కురు తమ మతసంప్రదాయములను మఱచి, మాంసాహా

వలును, మద్యపానమును చేయువారుగను మారుటయేగాక అన్యజాతిస్త్రీలను వివాహమాడుటయు జరుగుచుండెడిది. ఈ విషయములను తలంచుకొనినపుడు పుత్లీబాయిగుండె దడదడ లాడెను. ఉత్తమశీలుడగు తనకుమారుడు పాశ్చాత్యదేశముల కేగి, ఆ దేశీయుల సహచర్యబలమున శీలభ్రష్టు డగునేమో యని యామె సందేహించెను. సాధారణముగ సహవాసబల మున సుగుణములకంటె దుర్గుణములే మునుముందు పట్టుబ డును. ఆ కారణముననే మనవారు ఉత్తములతోటి చెలిమి చేయదగునని చెప్పిరి. పుత్లీబాయి తనకుగల సందేహములను కుమారునకుఁ దెలిపెను. గాంధిజీ, తల్లిపై కోపించెనా ? లేదు. ఉత్తమమాత బిడ్డలక్షేమమే తనక్షేమముగ దలంచు ననియు, అట్టిమాతృదేవత యనుమతిమీదనే కుమారు డొనరించు కార్యము విజయము నందుననియు నత డెఱుగును. ఆకారణ మున గాంధిజీ తల్లిసమక్షమున జైనమతాచార్యుకడ బ్రమా ణము చేసెను. తల్లి కోరినవి మూడునియమములు. మాంస భక్షణము మానుట యొకటి. మద్యపానము చేయకుండుట రెండు, అవినీతవర్తనము సలుపకుండుట మూడు. ఈ మూడు నియమములను తప్పక నెరవేర్తునని మహాత్ముడంగీకరించెను. అనంతరమున లండనునగరప్రయాణమునకు సిద్ధమయ్యెను.

తల్లియే ప్రత్యక్షదైవ మగుట ఆమెను విడిచియుండు టయు, స్వర్గమునకన్న మిన్నయగు జన్మభూమిని విడిచియుం

డుట మహాత్మునకు కష్టకార్యములైనను, తాను కోరినవిద్యల నభ్యసించుటకొఱకే వియోగమును సహించి లండనుపట్టణమున కేగెను.

అతడు లండను విశ్వవిద్యాలయమునందు జదివి పరీక్షలో విజయము నందెను. పిదప బారిష్టరుపరీక్షకు జదువుచుండెను. ఈ కాలమున గాంధిజీ తననియమములను అక్షరము తప్పకుండగ పాటించెను. ధీరచిత్తులను లౌకికవిషయములు కలంపవు. స్థిరచిత్తుడగు మహాత్ముని మనసున కచటి తుచ్ఛసుఖము లేవియు రుచింపలేదు. తన మతసంప్రదాయముల విడువక ననుష్ఠించుచు, తనచదువునందే దృష్టిని నిలిపి పరీక్షలో కృతార్థుడయ్యెను. తాను వచ్చినపని పూర్తి యగుటచే వెంటనే యతడు స్వదేశమునకు తిరిగి వచ్చెను.

అతడు తిరిగివచ్చునప్పటికే తల్లి మరణించుటచే, సుగుణఖనియగు కుమారుని చూచుభాగ్య మామెకు లేకపోయెను మాతృవియోగము తప్పనిదైనను కుమారుని హృదయమును కలంచివైచెను. అనంతర మాతడు తల్లికి పరలోకక్రియలను కావించి మాతృఋణవిముక్తి నందెను. బొంబాయిలోనుండి కొంత విరామమును తీసికొని హిందూపురాణములు, ధర్మశాస్త్రములు మొదలగు సద్గ్రంథములఁ బఠించుచునుండెను. ఆపై బొంబాయిలోని ఉన్నతన్యాయస్థానమున న్యాయవాద

వృత్తి నవలంబించి మేటిన్యాయవాది యనిపించుకొనెను. ఈ వృత్తియందైనను సత్యమును విడువలేదు. సాధారణముగ న్యాయవాదవృత్తి సత్యబద్ధ మైనచో రాణించుట కష్టము. కాని, మోహనదాసు సత్యమునకు లోబడి వ్యవహరించెనే గాని, ధనమున కాసపడి తప్పుడుమార్గముల సంచరింపలేదు. అట్లని ధనార్జనయందును మాత్రము వెనుకబడలేదు.

పరిస్థితు లిట్లుండగా, పోరుబందరు వర్తకసంఘమునకు దక్షిణాఫ్రికాఖండమున నున్న ప్రిటోరియాపట్టణ న్యాయస్థానమున నొకవ్యాజ్యము సంభవించెను. ఆ వ్యాజ్యమున వాదిం చుటకై గాంధిజీని ఆ పట్టణమునకు పంపిరి. కాని, గాంధిజీ దక్షిణాఫ్రికాలో కాలు బెట్టినంతనే కష్టములు తలచూపెను. న్యాయస్థానమున చిన్నచూపు, రైలులో అమర్యాద, చివరకు జట్కాబండిలో నగుబాటు. ఎన్ని యవమానముల కాతడు తల యొగ్గవలసి వచ్చెనో చెప్పజాలము. అన్నిటిని నాతడు సహించి న్యాయస్థానమున విజయమును సాధించెను.

గాంధిజీ దక్షిణాఫ్రికాఖండమున కేగినప్పు డచటిరాచ కీయపరిస్థితులు చాల విషమముగ నుండెను. మన దేశము నుండి చాలమంది యచ్చటికేగి నివాస మేర్పఱచుకొనియుం డిరి. అచ్చటి తెల్లజాతివారు మన దేశీయులను మిక్కిలి నీచ ముగ జూచుచుండిరి. హిందూదేశీయులు వారిదృష్టిలో జంతు

వులు. వారి కచట ఆలన, పాలన లేదు. దీని నంతయు నెఱిఁ
గిన గాంధిజీ పొందిన మనస్తాపమునకు పరిమితిలేదు. తా నా
స్వాతంత్ర్యప్రియుఁడు. ఆత్మాభిమానము కలవాఁడు. అట్టిమహా
నీయుఁడు తోడిదేశీయుల కష్టానుభవముల జూచి సహింపలేక
వారియిక్కట్టులను దొలగింపఁ బలువిధముల పాటుబడెను.
సృష్టిలోని మనుష్యు లందఱును సమాను లనియు, ఒక రొకరి
కంటె ఘనులమని తలంచుట వారిగర్వమును తెలియజేయు
ననియు బాహాటముగ జెప్పసాగెను. ధర్మబద్ధమైన మహా
త్మునిమాటలు సత్యములే యని వివేకులు తలంచినను, అది
సర్వులకును సరిపడునా ? పైత్యరోగికి పంచదార చేదనునట్లు
అధికారరోగపూరితుల కీ యుపన్యాసములు కోపమును రేకె
త్తించినవి. చెవిటివాని చెంత శంఖమూదిన ట్లీతని వినతులు
ప్రభుత్వముయెడ వ్యర్థము లైనవి.

న్యాయబద్ధముకాని ప్రభుత్వము తమలోపముల నెత్తి
జూపువారి నణచివేయుట కెన్నియో నూతనశాసనములను
జేయుచుండును. ఈ విధముగ తమ నిరంకుశపరిపాలనమును
సాగించుటయే పరదేశప్రభుత్వముయొక్క లక్షణము. ఈవిధ
మగు బలము నే పశుబలమని యందురు. పశుబలమును ధర్మ
బలముతో జయించుట సర్వోత్తమము. అంతియేకాని పశు
బలమును పశుబలముతో నెదుర్కొని పొందినజయము స్థిర

ముగ నిలువదు. ఆకారణము నూహించియే ధర్మరహస్యము నెఱిగిన మహాత్ముడు ఒక నూతనాస్త్రమును గనిపెట్టెను. దానినే "సత్యాగ్రహము" అని మహాత్ముడు చెప్పెను. ఈ సత్యాగ్రహసైన్యమునందలి వీరు లహింసాపరులై యుండవలెను. ఈ వీరులే స్వాతంత్ర్యయోధులు. ఇట్టి భారతయోధుల గూర్చుకొని, స్వాతంత్ర్యయుద్ధమును సాగించినవాడు మహాత్ముడు – నాయకుడు లేనిసంఘము, నాథుడు లేని కాపురము వంటిది.

గాంధిజీ సాగించిన సత్యాగ్రహయుద్ధము నణచుటకా ప్రభుత్వ మాయనను, ఆయనయనుచరులను చెరసాలలో వైచెను. మహాత్మునినిర్బంధ మూరకపోవునా ? లోకమున నాగరకప్రభుత్వము లా రాక్షస ప్రభుత్వాచర్యను తూర్పార బట్టిరి. ఆ దెబ్బతో ప్రభుత్వమునకు తల తిరిగిపోయినది. ఇక లాభము లేదని కారాగారమున నుంచిన స్వాతంత్ర్యయోధులను, వారినాయకుని ప్రభుత్వము విడుదల చేసెను.

గాంధిజీ సత్యాగ్రహాస్త్రము బ్రహ్మాస్త్రమువలె పని చేసెను. ముందుగ మహాత్ముని సత్యాగ్రహమును జూచి యుపహాస్య మొనరించిన యవివేకు లది సాధించిన విజయమును జూచి నివ్వెఱపోయిరి. దక్షిణాఫ్రికాప్రభుత్వపుముఖ్యాధికారి స్మట్సుసేనాని గాంధీజీతో నొక సంధిని చేసికొనెను.

దాని ననుసరించియే భారతదేశీయుల కష్టములను నివారింప జేయు నొక శాసనము కావింపబడెను దీనితో సత్యాగ్రహా స్త్రస్వరూపమును, మహాత్ముని లో నిమిడియున్న నాయకత్వ శక్తియు బ్రపంచమున నలుగడల వ్యాపించెను.

తాను మునుముందు సాగింపనున్న భారతస్వాతంత్ర్య యుద్ధమున కిది తొలిపలుకు. ప్రజలు గాంధిజీ ధీశక్తిని నిదర్శనపూర్వకముగ గ్రహించిరి. లోకమున ధర్మము నుపదేశించువారు తామా ధర్మము నాచరించుచు, దానిని లోకుల కుపదేశించుట యుత్తమపద్ధతి. మహాత్ముని ధర్మోపదేశము లన్నియు నట్టివియేగాన వాని నందఱు శిరసా వహించిరి.

మహాత్ముఁడు దక్షిణాఫ్రికాఖండమునందలి భారతీయుల కష్టములను గట్టెక్కించు పనులలో నుండ, మన భారతదేశమున ప్రముఖులు కొందఱు భారత స్వాతంత్ర్యోద్యమమును నారంభించి పని చేయుచుండిరి. దీనినే "ఇండియన్ నేషనల్ కాంగ్రెస్" అని పిలుచుచుండిరి. ఇదే కాంగ్రెసు. భారత రాజకీయరంగమునఁ జేరి స్వాతంత్ర్యపోరాటమునఁ బ్రముఖుడుగ పనిచేయవలసినదని కోరుచు మనదేశీయులు మహాత్ముని పిలచిరి. దేశీయులపిలుపును తల ధరించి గాంధిజీ ౧౯౧౮ లో భారతజాతీయకాంగ్రెసులో చేయి జేసికొనెను. మహాత్ముఁ డడుగుపెట్టుటయే తడవుగ జాతీయోద్యమమున నూతనచైత

న్యము కలిగెను. ప్రజలయం దుత్సాహము రెండింతలయ్యెను. గాంధిజీ భారతదేశమునందలి భిన్నజాతులవారిని జూచి వారి చిత్తవృత్తులను గ్రహించుచు, దేశాభిమానమును రేకెత్తించు పలుకులఁ బలుకుచు దేశమునం దంతటను సంచార మొనరించెను. మహాత్మునియుపన్యాసములు దేశీయుల కమృతధారలైనవి. అతడు తమకు దగిననాయకు డని జనులందఱు విశ్వసించిరి. అనంతరము గాంధిజీ దేశమున నంటరానితనమును నిర్మూలించినగాని దేశమునకు నిజమైన ముక్తి లేదని గ్రహించి సబర్మతీనదీతీరమున సత్యాగ్రహాశ్రమము నిర్మించుకొనెను. తన ననుసరించువారు జాతిమత కులతత్త్వములకు దూరులై అహింసయే వ్రతముగా గలిగి, సత్యమునే దైవముగ నారాధించువారై యుండవలెనని నిర్ణయించెను. ఈ నియమములకు కట్టుబడి పెక్కుమంది ఆశ్రమములో జేరిరి.

క్రీ॥శ॥ ౧౯౧౭ లో బీహారురాష్ట్రములోని నీలిమందు కూలీలు అధికారులచే హింసింపబడుచుండిరి. బీదలపాలిటి కల్పవృక్ష మగు మహాత్ముడీవార్త విని వెంటనే యచటికేగెను. ప్రభుత్వ మీతని రాష్ట్రమును విడిచి పొమ్మనిరి. అంతమాత్రమునకే భయపడివచ్చు భీరువు కాడుగదా! ప్రభుత్వమును నమ్మించి విచారణచేయించి కూలీలకు న్యాయము కలుగజేసెను. మహాత్ముడు సిద్ధసంకల్పుడుగదా! ఆ మఱుసం

వత్సరము అహమ్మదాబాదులో వస్త్రములయంత్రాలయాధి కారులకును, కూలి పనివాండ్రకును పోరాటము కలిగెను. మహాత్మ డచ్చట సిద్ధమయ్యెను. యంత్రాల యాధికారుల కెన్నియో నీతు లుపదేశించెను. కాని అవి ఫలింపలేదు. తుదకు ఉభయులమధ్య గల పోరాటము తీరువఱకు తా నుప వసించెదనని మూడుదినము లుపవసించెను. అం దేమహత్తర శక్తి గలదో ! యంత్రాలయాధికారులు తమ మనస్సుమార్చి మహాత్ముని యుపదేశానుసారము నడచుట కంగీకరించిరి. మహాత్మ డుభయులకును సమాధానమును కుదిర్చెను. పిమ్మట నేటి ప్రముఖనాయకు లనబడువారు నాడు మహాత్ముని ము ఖ్యానుచరులుగ జేరిరి.

కొంతకాల మైనతరువాత గుజరాతులోని ఖైరాజిల్లాలో కఱవు వచ్చెను. పంటలు పాడైనవి. ప్రజలకు తినదిండి, కట్ట బట్ట లేక "అన్నమో రామచంద్రా!" అని అల్లాడుచుండిరి. కాని ప్రభుత్వము పన్నులకొఱకు ప్రజల నిర్బంధింపనె మొద లిడెను. 'ఎద్దుపుండు కాకికి ముద్దా?' అన్నట్లు ప్రజలకష్టములు ప్రభుత్వము గుర్తింపలేదు. ఆసమయమున మహాత్ముడు ప్రభుత్వమునకు విన్నప మంపెను. ప్రజలు మొఱలిడిరి. కాని వినెడివా రెవరు ? తుదకు మహాత్మునినాయకత్వమునకు ఫల ముగ బీదరైతుల యిక్కట్టులు చక్కజేయబడినవి.

విదేశీయమగు నాంగ్లేయ ప్రభుత్వము భారతీయులు సాగించుచున్న జాతీయోద్యమము నడచివేయుటకు చేయదగి నన్నిపనులుచేసినది. భేదతంత్రము,దండోపాయమును ప్రయోగించినది.సముద్రముదాటిన హనుమంతునకు పిల్లకాలువయొక లెక్క కాదుగదా! అట్లే నాయక శేఖరుండైన మహాత్ముడు ధీరతతో తన్నెదుర్కొను కష్టపరంపరల లెక్కచేయక తన కార్యమును దీక్షతో నిర్వహించుచుండెను. సత్యాగ్రహయుద్ధ మును బహుముఖముల సాగించి దేహబలమునకన్న నాత్మ బలమే బలీయమని లోకమున కెఱిగించెను.

మహాత్ముడు చేయు నొక్కొక్కప్రకటన యొక్కొక్క వజ్రాయుధమువలె నాటి ఆంగ్లేయుల ధైర్యమును పటాపంచలు చేయుచుండెను. మహాత్మునియాజ్ఞ విన్నంతనే భారత ప్రజాసమూహ మొక్కటే దాని నెరవేర్ప నడుము కట్టుచుండెను. క్రీ॥శ॥ ౧౯౨౦ నుండి ౧౯౪౭ వఱకును అహింసతో కూడిన జాతీయయుద్ధమును పెక్కు విధముల నడిపించెను. ప్రజాబలముముందు ప్రభుత్వబల మూగులాడుచుండెను.

క్రీ॥శ॥ ౧౯౪౨ ఆగష్టులో గాంధీమహాత్మ డాంగ్లేయులను భారతదేశమును విడిచిపొమ్మని యాజ్ఞాపించెను. ఈ యాదేశము తిరుగులేనిదయ్యెను. ఈసంగ్రామసందర్భము లలో నెన్నిసారులు మహాత్ముడు కారాగారములలో నుండె

నో, ఎన్ని యిడుములకు తలయొగ్గెనో చెప్పజాలము. దేశ స్వాతంత్ర్యమును శాంతిసమరమున సాధించుట యన నంత సులభమైన దియా ? భారత దేశమున శాంతిసమరము సాగు చుండగనే ద్వితీయప్రపంచయుద్ధ మారంభ మయ్యెను. ఆంగ్ల ప్రభుత్వము ఘోరవిపద్దశలో జిక్కుకొనెను. అచట కార్మిక పక్షము అధికారములోనికి వచ్చెను. ఈపరిస్థితులన్నియు నాటి యాంగ్లేయప్రభుత్వమునకు వివేకోదయము కలిగించెను. ఎన్న టికైనను సత్యాహింస ధర్మములు జయించి తీరునని మన ప్రాచీనచరిత్రలు బాహాటముగ దెలియజేయుచునే యున్నవి. ప్రజల కిష్టములేని ప్రభుత్వముయొక్క జీవితము దినదినగం డము వేయేండ్లాయు వన్నట్లుండు నను సత్యమును గ్రహించి భారతీయులకు స్వాతంత్ర్యము నొసగుట కింగ్లీషుప్రభుత్వము నిశ్చయించుట తప్పనిసరి యయ్యెను.

అంతనాంగ్లేయప్రభుత్వము గాంధీమహాత్మునితోడను, తక్కుంగల నాయకులతోడను రాయబారములు సాగించెను. ఆసంప్రదింపుల ననుసరించి మహమ్మదీయులకు పాకిస్తానమును, మిగిలినవారికి హిందూస్థానమును బంచియిచ్చిరి. ఈస్వాతంత్ర్య ప్రదానము మన దేశమునకు క్రీ॥శ॥ ౧౯౪౭ ఆగస్టు ౧౫వ తేదీ నాడు జరిగినది. ఆనాడు మన దేశమునందలి సర్వజాతులకును గొప్ప పండుగదినము. సగౌరవముగ భారత దేశమునందున్న

పాశ్చాత్యుల మనవారు జూచిరనుటకు మనకు మొదటి గవర్నరు జనరలు మౌంటుబేట నగుటయే గొప్పసాక్ష్యము.

మహాత్ముని తపస్సు ఫలించినది. ప్రజాప్రభుత్వమును నడుప స్వతంత్రపువాత తనయంతటి దేశభక్తుడును, కార్యదక్షుడును నగు శ్రీపండిత జవహర్లాలునెహ్రూను నియమించెను. ఔరా! మహాత్ముని స్వార్థత్యాగము! బహుళకష్టమున సంపాదించిన భారతస్వాతంత్ర్యమునందే యధికారము నాతడు కోరలేదనుట ఆ మహనీయుని త్యాగశీలమునకు తార్కాణముగాదా! ఇట్టి సంఘటనము, అనగా అధికారవాంఛావిముఖత్వము, ఏ దేశచరిత్రయందును కానము. స్వాతంత్ర్యదినోత్సవమునాడు హిందూస్థానమంతయు బ్రహ్మాండమగు వేడుకలు సలిపినను మహాత్ముడీవిషయమున తామరపాకు మీది నీటిబొట్టువలెనే యుండెను.

మహాత్ముడనుదినము ప్రార్థనసభల జరుపుచు సర్వమానవకల్యాణమును సాధించుటకు తగినమార్గముల నుపదేశించుచుండెను. ఈ యుపన్యాసములలో స్వార్థ మణుమాత్రమును లేదు. తన యనుభవములనే లోకులకు బోధించెడు సద్గురుడు. ఆ సభల కనేకులు వచ్చి, విని విజ్ఞానమును సంపాదించుకొనువారు.

ఇట్లే ౧౯౪౮ జనవరి ౩౦ వ తేదీనాఁడు ఢిల్లీనగరము నందలి బిర్లాభవన ప్రార్థనసభకు వచ్చుచుండిన మహాత్ముఁడు తుపాకిదెబ్బ కెఱయై పావన భగవన్నామమును పలుకుచునే ప్రాణముల విడెను. దానితో భారత దేశమంతయు శోకసూచక మంధకారమున మునిగిపోయినది. భారతజాతికి తండ్రి యనదగు మహాత్మునియస్తమయము మెవ్వని హృదయమును కలంచివేయదు!

తనజీవితమునంతయు దేశసేవకై ధారపోసిన మహానీయుఁడు — లోకమే తనకుటుంబముగ భావించిన మహాత్ముఁడు— భారతదేశమునందలి బీదవారి నుద్ధరించుటకై కంకణముకట్టుకొని శక్తిలోపము లేనివిధమున సేవచేసినాఁడు. కట్ట మోకాలు దిగని బట్ట; నివసింప బీదల పూరికొంప. ద్వేషమను భావమున కాయన విశాలహృదయములో తావులేకుండెను. ఇట్టి మహనీయుని పోగొట్టుకొనిన భారతీయులదే దురదృష్టము. నిస్పృహులము. వీతరాగుఁడనగు నామహాత్ముఁడు మృతజీవియే.

మహాత్మునిమృతికి నెహ్రూపండితుఁడు పొందిన దుఃఖ మపారము. కాదామఱి! కన్నతండ్రికంటెమిన్నగ మనలఁజూచు కొనుచు విజ్ఞానచక్షువును ప్రసాదించినవాఁడు మహాత్ముఁడు. శ్రీకృష్ణు డవతారమును చాలించినా డర్జునుఁడు నిర్లేదుఃఖిం

నెను. ఏల ? కేవలము చుట్టఱికమునకా ? కాదు. అర్జునునకు గీతను బోధించి విజ్ఞానము ననుగ్రహించిన యట్టి కృష్ణునకు.

పుణ్యపురుషు డగు మహాత్ముని భౌతికశరీరమునకు యమునానది యొడ్డున రాజఘాటులో దహన సంస్కారము కావింపబడెను. లక్షలకొలది జనులు అశ్రుబాష్పముల కావించిరి. ఆ పవిత్రమూర్తి యొక్క అస్థికలను దేశమునందలి పుణ్యనదు లన్నిటిలో కలుపబడెను.

ఎంతకాలము గతించినను మహాత్ముని సువర్ణసూక్తులు దేశీయులకు విజ్ఞానభిక్షను పెట్టుచునే యుండును. గాంధీ జీవితచరిత్రమున ముఖ్యముగ మనము గమనించి అనుష్ఠింపవలసినది దేశసేవ ; దీనజనుల నుద్ధరించుట ; సర్వమానవ సమానత్వము ; సత్యాహింసలను విడువకుండుట.





# 2. శ్రీ సరోజిని

ప్రాచీన కాలమునుండియు భారత దేశమున పురుషు లతోపాటు స్త్రీలును మహోన్నతకార్యముల నొనరించి, విశ్వవిఖ్యాతి నార్జించి రనుట కే సందియమును లేదు. వేద

కాలమున గార్గేయి, మైత్రి మొదలగువారును, పురాణకాల
మున సీత, సావిత్రి మొదలగువారును, చారిత్రికయుగమున
నహల్యాబాయి, ఝాన్సీ లక్ష్మీబాయి, రాణీ రుద్రమదేవి
మొదలగువారును, ఆధునికయుగమున శ్రీసరోజిని, శ్రీఅమృత
కౌరు, దుర్గాబాయి మొదలగువారును తగిన సాక్ష్యములు.

అట్టిమహనీయుల జీవితచరిత్రములను మనము చదివి
వారి యుత్తమగుణముల నాదర్శముగ నుంచుకొని, మనము
కూడ వారుపోయిన మార్గములలో కాలమునకు దగినట్లు
పలయు మార్పులఁ జేసికొనుచు, నడచుకొనుటకు ప్రయత్నింప
వలెను. గొప్పవారుగ పరిగణింపబడు జనులలో మూడు
తెగలు కలవట. పుట్టుకనుంచియే గొప్పవారైనవారు; కాల
క్రమమున తెలివితేటలచే గొప్పతనము నందినవారు; స్వార్థ
పరులచే గొప్పవారుగ జేయబడినవారు అని. కాని యిందు
మొదటి రెండుతెగలకే నిజమైన గౌరవము. శ్రీసరోజినీదేవి
యిట్టితెగలలోఁ జేర్పఁదగినది.

భారతభూభాగమగు వంగదేశమున పెక్కుమంది విద్యా
విజ్ఞానసంపన్నులు జన్మించిరి. ఆ దేశమునందలి బ్రాహ్మణు
లలో చటోపాధ్యాయవంశము విజ్ఞానమునకుఁ బెట్టినపేరు.
ఈ వంశముననే అఘోరనాథ చటోపాధ్యాయుడు పుట్టి వం
లెను. రత్నాకరమునందు మణులు పుట్టును గాని గాజుపెంకులు

పుట్టవుకదా! అఘోరనాథుడు, నాటివిద్వాంసులలో మంచి
పేరును సంపాదించెను. ముత్యములు సముద్రములోపల నడగి
యున్నను నేర్పరులైన జాలరులు సముద్రములోని కేగి
ముత్యముల సంపాదించుకొందురుకాని మానరుగదా.

అప్పుడు హైదరాబాదు రాజ్యమున నిజాంకళాశాల
స్థాపింపబడెను. ఆ కళాశాలను సమర్థతతో నడుపుటకు దగిన
ప్రధానాచార్యుని యావశ్యకత యేర్పడెను. ఆకారణమువలన
నాటి నిజాంప్రభుత్వము మంచి విచక్షణత నుపయోగించి
వంగదేశమునుండి శ్రీ అఘోరనాథపండితుని పిలిపించి ప్రధా
నాచార్యపదవి నిచ్చిరి. ప్రధానాచార్యపదమును స్వీకరించిన
తరువాత కళాశాలను చక్కగ నిర్వహించుచు, విద్యార్థుల
పాలిటి కల్పవృక్షమువలె నుండెను. కళాశాలపని సమూహ
ప్రాపు లాయకాయ లన్నట్లుండెను.

క్రీ॥ శ॥ ౧౮౭౯ ఫిబ్రవరి ౧౩వ తేదీని అఘోరనాథుని
పూర్వపుణ్యవిశేష మనదగిన మన సరోజినీదేవి పుట్టినది.
అమృతమునకు పుట్టుకతోడనే మధురిమ కలిగినట్లు సరోజిని
యందు బాల్యమున ఉత్తమలక్షణములు కనుపట్టుచుండెను.
తండ్రిదగ్గఱనే విద్యాభ్యాసము చేసెను. నేటి విదుషీమణి
కాదగిన సూచనలు కానవచ్చెను. కవితాభిరుచి యామెలో

పొడసగట్టెను. తనపుస్తకములయం దచ్చటచ్చట తాను రచిం చిన పద్యములు [ఆంగ్లేయభాషలో] కనబడసాగెను.

పండ్రెండుసంవత్సరములప్రాయమునాడే సరోజినీదేవి మదరాసు విశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషన్ పరీక్ష [ప్రవేశ పరీక్ష] యందు కృతార్థురాలయ్యెను. తరువాత పదునైదేం డ్లేనియు నిండీనిండకముందే ఉన్నతవిద్యాభ్యాసమునకై ప్రభు త్వపు విద్యార్థివేతనముతో ఇంగ్లాండున కేగెను.

లండన్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములలో నీమె చదువుకొనుకాలమున, కళాశాలవిద్య ఈడునకు మించిన దగు టచే, ఆమెయారోగ్యము తఱచుగ భంగము కాజొచ్చెను. తదాది పాప మెప్పుడును నారోగ్యసౌఖ్యమును సమగ్రము ముగ ననుభవించలేకపోయెను. ఈ అనారోగ్యపరిస్థితికి భయ పడక తన నిత్యధర్మములను, సక్రమముగను సోత్సాహము గను నిర్వహించుచునే యుండెను. మనశ్శక్తి సంపన్నులకు భౌతికాటంకము లొక లెక్కలోనివి కావనుట కిది చక్కని దృష్టాంతము.

ఆ కాలమున పాశ్చాత్యవిద్వత్ప్రముఖులు పెక్కురామెను గుఱించి మిక్కిలి ప్రశంసించిరి. కాదామఱి. ఈడునకుమించిన విద్య, విద్యకుమించిన వినయసంపద ఆమెకు పెట్టనిసొమ్ములు.

ప్రకృతిసౌందర్యమును గ్రహించుటలోను, లలితపద ములతో తత్సౌందర్యమును చిత్రించుటలోను ఆమె అందె వేసినచేయి. కవిత్వము ప్రయత్నసాధ్యము కాదనియు, సహజ మనియు నామె రచనలు తెలియజేసెను. కవితాశక్తి దైవాను గ్రహ లబ్ధము. హాస్యరస మామెకు సహజము.

ఈమె ప్రకృతిరామణీయతను దర్శించు కుతూహాల ముతో నింగ్లాండునుండి ఇటలీదేశమున కేగెను. అచ్చటి శోభావంతములైన దృశ్యములను చూచి. అచటి పురాతన నాగరకతాచిహ్నముల నెన్నగ గుర్తించి, క్రమముగ మాతృ భూమియగు భరతఖండమున కేతెంచెను. అనంతరము కొంత కాలమునకు సాంఘికశృంఖలములకు కట్టుబడక, తన కనురూప పతి యగు డాక్టరు ముత్యాల గోవిందరాజులు నాయుడుగారిని వివాహమాడెను. శ్రీనాయుడుగారు నిజాము రాష్ట్రమునందలి హైదరాబాదునివాసి; ఆంధ్రుడు. తాను వంగదేశపు కన్య యయ్యు నాంధ్రుని వివాహమాడుటలో నామెకుగల విచ క్షణాశక్తి పరిగణనీయము. ఆ కాలపునాటి సాంఘికపరిస్థితు లిట్టి వివాహమున కనుమతించెడివికావుకాన నిదొక యాదర్శ సంస్కార వివాహముగ ప్రాజ్ఞులచే కొనియాడబడెను.

స్త్రీకి వివాహమైనతరువాత కుటుంబబాధ్యత లలుము కొనుటవలన వారి సహజశక్తులకు సక్రమవికసన మేర్పడదని

మన మూహింపవచ్చునుకాని యామెయెడ మన యూహా యథార్థమైనదని చెప్పవచ్చును.

ఆమె తనకవితారచన నప్రతిహతముగ సాగించుచునే యుండెను. హైదరాబాదునందలి సాంఘిక, సాంస్కృతిక జీవితములలో నామె పాల్గొనుచునే యుండెను. ఈమె బిడ్డలలో శ్రీ జయసూర్య యను సుతుడును, పద్మజ, లీలామణి యను కుమార్తెలిద్దరును సున్నితవిద్యల నభ్యసించి, దేశసేవయే తమ జీవితసాఫల్యముగ కృషిచేయు ధన్యజీవులు.

హైదరాబాదునగరమును మూసీనది ముంచివేసిన పుడు, జనసమాజమునకు నాడామె చేసినసేవ మఱువరానిది. అపారమైన యామెసేవను మెచ్చి ప్రభుత్వమువారు ప్రశంసా సూచకముగా "కైజర్ హింద్" అను సువర్ణ పతకముతో బహూకరించిరి. స్త్రీ, పురు, జాతి, మత, కుల విచక్షణ లేకుండ సర్వుల కొకేవిధముగు సేవచేయుటయే సాంఘిక సేవ. సంఘ సేవాసక్తులకు ప్రభుత్వ బహుమానాలు, వార్తాపత్రికలలో పెద్ద అక్షరాలతో పేరు ప్రకటింపబడుట యనునవి లక్ష్య ములుగావు. నిష్కల్మషమైన ప్రేమతో మానవసేవ చేయు టయే వారిలక్ష్యము. మానవసేవయే మాధవసేవ యనీ వారి సిద్ధాంతము. అట్టి పరమసాంఘికసేవకులలో నుత్తమశ్రేణికిం జెందినది శ్రీమతి సరోజినీదేవి.

౧౯౧౭ లో కాంచీపురమున రాజకీయ మహాసభ యొకటి జరిగెను. ఆ సభకు అధ్యక్షత వహించుటకుగాను శ్రీ సరోజినీదేవి ఆహ్వానింపబడినది. వారిపిలుపున కంగీకరించి, రాష్ట్రీయ రాజకీయసభ కధ్యక్షత వహించి, దిగ్విజయముగ నా సభను సాగించెను. సర్వతోముఖప్రజ్ఞగల యీమె విదుషీ మణికి కిట్టి సభాకార్యనిర్వహణ మొక లెక్కలోనివిషయము కాదుగదా! దీనివలన నామెకుగల రాజకీయపరిజ్ఞాన మానాటి రాజకీయరంగమునందలి నాయకులకు దిగ్భ్రమను కలిగించెను.

౧౯౨౩ లో భారతజాతీయసభవారు నేర్పరు లగువారలను గొందఱ నేర్చికూర్చి ఒక రాయబారవర్గమును సిద్ధపరచిరి. ఈ రాయబారవర్గమున మన సరోజినీదేవి యొకతె. ఈ రాయబారవర్గముతోకూడ కెన్యాదేశమున కేగెను.

భారతదేశమునుండి కొందఱు దక్షిణాఫ్రికా దేశమున కేగి స్థిరనివాస మేర్పఱచుకొనియుండిరి. అట్టి మన భారతీయులకు మిక్కిలి అవమానకరమును, అపకారకారకమును నగు 'మాలపల్లి శాసనము' అను నొకదుశ్శాసనమును దక్షిణాఫ్రికాప్రభుత్వము నిర్మించెను. ఈ శాసనమును తిరస్కరించుటకై శ్రీమతి సరోజినీదేవి ౧౯౨౪ లో దక్షిణాఫ్రికా ఖండమునకు తిరిగి పోక తప్పినదికాదు. ఈమె పోవునప్పటికే కారణమువనోగాని, యచటిప్రభుత్వము తమ దుశ్శాసన

మును నాచరణలోనికి తేక యూరకుండినది. వెంటనే యామె తిరిగి స్వదేశమునకు వచ్చెను.

భారత జాతీయమహాసభ మహాత్ముని నాయకత్వమున భారతీయులకు స్వాతంత్ర్యమును సంపాదించుటకై పని చేయుచున్న మహాసంస్థ. అట్టి యావద్భారత దేశసంస్థకు నధ్యక్షత వహించుట యన సామాన్యవిషయము కాదుగదా! స్వార్థరహితులై, దేశభక్తిపరిపూరితులై యున్నవారికే యది తగినదికాని సామాన్యుల కాయధ్యక్షపదవి యందరానిపండు. విద్యావిషయమున వెనుకబడియున్న భారతనారుల విషయమున నీ పదవిని తలపెట్టు నవకాశము లేకుండెను. ఈ పరిస్థితులలో ౧౯౨౫ సంవత్సరమున కాన్పూరునందు జరిగిన భారతజాతీయమహాసభకు శ్రీమతి సరోజినీదేవిని అధ్యక్షురాలినిగ నెన్నుకొని నాటి భారతజాతి తమగౌరవమును కాపాడుకొనినది. మహాత్ముల గౌరవముచేయుట మనలను మనము గౌరవించుకొనుటయే యగునుగాని తదన్యము కానేరదు. ఆమహాసాధ్వి యానాటి మహాసభాధ్యక్షపీఠముననుండి పలికిన పలుకులెట్టి విజ్ఞానసంపన్నములును, వినయ పరిపూరితములును నైయున్నవో చూడుడు!

"నామాతృమూర్తియగు భారతాంబ, స్వతంత్రురాలై తనయింటిని చక్కబెట్టుకొను పనియందు బిడ్డ

నను నే నామెకు సాయపడుట నావిధి. ఈ నా తల్లి ప్రపంచములో నెన్నియో మన్ననలుపొందిన ఉత్తమ యిల్లాలు. అట్టి భారతమాత స్వతంత్ర కావలె నన్న బిడ్డలమగు మనము బలవంతులము కావలెను. మన లో మనము పరస్పరము మత ద్వేషములతో కల హించుకొనరాదు. ధనికులు, బీదలు, గొప్పజాతి, నీచ జాతి అను భేదము లుండరాదు. ఈ మన దేశమున నున్న మానవు లెవ్వరు నెట్టిబాధయు బొందరాదు. నా తల్లియిల్లు చూడ ముచ్చటగ నుండునట్లుచేయుట నా విధి. ఈ నావిధిని నా సోదరీసోదరుల సహాయ సం పత్తి చేత నే నేను సక్రమముగ నిర్వహింపగలను.”

ఇందామె విశాలహృదయము స్పష్టమగుచుండుట లేదా! భారతీయులవిధిని సూచించుట లేదా! మాతృదాస్య విమోచ నమునకై గరుడుం డెంతటి త్యాగ మొనరించెనో మనకు తెలియును గదా! అట్టి త్యాగమూర్తులే యెంతటి మహత్తర మైన పనిని చేయగలరు. శ్రీసరోజినీదేవి, సర్వసంపన్నయగు గేస్తురాలయ్యును, ఇట్టి మహాత్యాగశీల మలవఱచుకొనుట మిక్కిలి ప్రశంసనీయము. భారత జాతీయ మహాసభాచరిత్ర మున నధ్యక్షపదవి నందిన దీయొక్క నారీరత్నమే.

ఈ కాంతాశిరోమణి దేశమునకు జేసిన సేవ వివిధ రూపముల గలదు. అందులో విదేశముల సంచరించుట

నొకటి. ఆనాడు విదేశీయులు కొంతకాలము మన దేశమున
నుండి మనమిచ్చిన యాతిథ్యగౌరవముల గ్రహించి చివరకు
వారు తమ దేశముల కేగినపిమ్మట, తిన్నయింటి వాసముల
నెన్ను బుద్ధిమంతులవలె, మనమాతృదేశవిషయమున నీలాప
నిందలు వేయసాగిరి. ఈ విషయ మెఱింగి ౧౯౨౭-౨౮
సంవత్సరమున కెనడా, అమెరికా మొదలగు విదేశముల కేగి
భారతజాతి విదేశపరిపాలనక్రింద నెట్టియిక్కట్టులకు చిక్కిన
దియో, భారతీయసంస్కృతి యెంత మహోదార మైనదో,
భారతీయ సాంఘిక మర్యాద లెట్టి యుదారాశయములతో
నేర్పడినవో తెలియజేయుచు సులలితమును, మృదు మధుర
మును నగు చక్కనిభాషలో నుపన్యసించి, తన తల్లి యెడ
చేయబడుచున్న దుష్ప్రచారమును పూర్తిగ ఖండించెను.
సబిడ్డ తనతల్లి నితరులు నిష్కారణముగ నిందించుచుండ విని
సహింపగలదు? కుళ్ళుబోతుతనమును వెళ్ళగ్రక్కుచు విదేశీయు
లిక నోరు మెదలింపలేరైరి. తూర్పు ఆఫ్రికాఖండములోని
జాతీయమహాసభవారు తమ వార్షికోత్సవసందర్భమున, ఆసభ
కధ్యక్షత వహించుట కీరమణీలలామ నాహ్వానించిరి. వెంటనే
శ్రీ సరోజనీదేవి యా సభాధ్యక్షతను వహించి, మేఘ గంభీర
వాక్కులతో నుపన్యాసవర్షమును కురిపించెను. ఈ శ్రీమ యొస
గ్గిన యుపన్యాసఫలితముగ విదేశములయందు భారతీయుల
గౌరవము పెంపొందెను.

౧౯౩౦లో భారతభూభాగమున ఉప్పుసత్యాగ్రహము సాగినప్పుడు మనధీరనాయిక యందు పాల్గొని, నాటిఆంగ్లేయ పరిభుత్వముచే చెఱసాలలో వేయబడెను. ఆ కారాగారసమయమునందు గాంధీమహాత్మునికి నుపచారములు సేయుచు [మహాత్ముడుకూడ చెఱసాలలో నిర్బంధింపబడెను] అందే విశ్రాంతి సుఖము ననుభవించెను.

భారత జాతీయమహాసభతోడి సంప్రతింపులకొఱకు ఆంగ్లేయపరిభుత్వమువారు సిద్ధపడి తమ యభిప్రాయమును సభాధ్యక్షునకు తెలియజేసిరి. అప్పుడు లండననగరములో గుండ్రబల్ల ["రౌండు టేబిల్ కాన్ఫరెన్సు"] సమావేశమున కేర్పాట్లు కావింపబడెను. ఆ సమావేశమున బాల్గొనుటకు భారతదేశమునుండి మహాత్ముడగు గాంధియు, మాలవ్యపండితుడును, శ్రీమతి సరోజినీదేవియు నేగిరి. ఆ సమావేశమును ముగించుకొని వచ్చినతరువాత తిరుగ భారతదేశమున జరిగిన స్వాతంత్ర్యయుద్ధములలో పాల్గొనుచు, పెక్కుపర్యాయములు చెఱసాలలో నిర్బంధింపబడెను. ఈ నిర్బంధము లేవియు నామె దీక్షను సడలింపజాలకపోవుట యట్లుండ దానిని నుఱింత దృఢపఱచెను. ఇంచుమించుగా సిరువదైదేండ్లు భారత జాతీయ మహాసభా కార్యనిర్వాహకసంఘమున సభ్యురాలుగ నుండి, అవిచ్ఛిన్నమైన దేశారాధనమును సాగించిన ధీరురాలు మన సరోజినీదేవి.

ఎంతకాలమునుండి యోసాగించుచున్న భారతజాతీయ సమరము సంపూర్ణవిజయము నందినది. 1947 ఆగస్టు 15వ తేదీని భారతమాత పరదాస్యమునుండి విడిపింపబడి స్వతంత్రు రాలయ్యెను. ఆనాటి యానందము వర్ణనకు చాలనిది. చేసిన కృషి ఫలించిననాడు గాక రైతునకు సంతోష సౌఖ్యము లేనాడు లభించును ? తానిక విశ్రాంతిమయమైన జీవితమును గడుపవచ్చునని యువ్విళు లూరినది. కాని దేశీయు లామెను విడువగలరా ? మధురమూర్తియైన మాతృదేవిని, సరోజినీ దేవిని దర్శించి హర్షింపనివా రెవ్వరు ?

స్వతంత్రభారతమున, జాతీయప్రభుత్వ మీ దేశసేవా ప్రవీణను సంయుక్తరాష్ట్రములకు "గవర్నరు"గ నియమించెను. భారతమహిళలయం దిట్టి యపూర్వగౌరవ మందిన దీ నారీరత్న మొక్కతెయే.

అధికారిణి యైనంతనే యధికతర బాధ్యతాభరముచే క్రుంగినదిగాని యెగిరిపడలేదు. మిగుల సమర్థతతో తన పరిపాలనాధికారమును సాగించెను. ప్రజలను తన ప్రజలవలెనే వాత్సల్యమున సాకెను.

ఈ మహాసాధ్వి 1949 లో మార్చి 2వ తేదీనాడు లక్నో నగరమున స్వర్గస్థురాలయ్యెను. భారతావని నంతయు

నొక శోకతరంగము ముంచివైచెను. భారతాంబ గళమునం
దలి రత్నహారమున నొక యుజ్జ్వలరత్నము రాలిపోయెను.

చూచితిరా! మానవుడేనాటికేని మృతి నొందుట తప్పనిదియే. దానికై విచారింప నవసరము లేదు. కాని, మానవుడు తన జీవితకాలమున సర్వజనాభ్యుదయమునకై, లోక కల్యాణమునకై లోకశాంతికి తానొనర్పగలిగినంతటి సేవను చేసి, తనన్కాలమున మృతజీవియై యుండుటకు యత్నింపవలయును. అట్టివారే నరులు. తదన్యులు పామరులు.





# ౬ శ్రీకృష్ణదేవరాయలు

విజయనగరసామ్రాజ్య మను పేరును విన్నంతనే, శరీ
రము గగుర్పని యాంధ్రు డుండడు. చేయెత్తి మ్రొక్కని
హైందవు డుండడు. భారతభూమి నెన్నియో సామ్రాజ్యము
లుదయించినవి; అస్తమించినవి కాని తమయశస్సును శాశ్వ
తముగ నిలుపుకొన్నవి లెక్కకు మిక్కిలి తక్కువ. అట్టి
సామ్రాజ్యములలో తలమానికము మన విజయనగరసామ్రా
జ్యము. ఉత్తమ సంతానముచే కులము వన్నె కెక్కునటు

లుత్తమ నరపాలపాలితములైన సామ్రాజ్యములుకూడ వన్నె
కెక్కెను.

క్రీ॥ శ॥ ౧౪౯౦ మొదలు ౧౫౦౯ వఱకును విజయనగ
రమును పాలించినరాజు నరసరాయలు. ఈనరసరాజు తుళువ
వంశమునకు జెందినవాఁడు. నరసరాజునకు ముగ్గురు భార్య
లుండిరి. పెద్దభార్య తిప్పాంబ ; రెండవయామె నాగాంబ ;
మూఁడవభార్య ఓబలాంబ. వీరిలో తిప్పాంబకు వీరనరసింహ
రాయలును, నాగాంబకు కృష్ణదేవరాయలును, ఓబలాంబకు
అచ్యుతరాయలును జన్మించిరి.

కృష్ణరాయలు జన్మించిన ముహూర్తంబు శుభకరం
బగుటచే నరసరాయలు బీజనగర దేశ మంతయు స్వాధీనము
చేసికొనెను. అందుచే నరసరాయలు కృష్ణదేవరాయలను
మిక్కిలి గారాబమున నాదరింపుచుండెను. లోకములో, సాధా
రణముగ తమబిడ్డలలో నేయొక్కరో పుట్టినప్పుడు, తమ
యింట నేదేని గలసివచ్చిన నా బిడ్డ పుట్టినవేళ మంచి దని
తలంచుటయు, ఆ బిడ్డను కొంత విశేషముగ జూచుటయు
సహజమేగదా! అంతమాత్రముచే తల్లిదండ్రుల కితరబిడ్డల
యం దనురాగము ఉండకుండదు. కాని నరసరాజు కృష్ణరా
యలను వాత్సల్యమున జూచుట తిప్పాంబ, ఓబలాంబలకు
గిట్టనిదయ్యెను. అది సవతితల్లుల సామాన్యలక్షణము. ఆ

భార్యలిరువురు నొకటియై కృష్ణరాయలను కణ్ణాని హేషుని గావింపతలచి తగినమార్గముల నరయుచుండిరి. ఈ కుట్రసంత యును నరసరాజు గ్రహింపకున్నను, బుద్ధిమంతుడు మంత్రి తిమ్మరుసు తెలిసికొనెనుకాని తానేమి చేయగలడు ? రాణు లపై కుట్రనేరము నాపాదించుట యెట్లు? ఇట్లుండగనే నరస రాజు తిప్పాంబ, ఓబలాంబలమాటలు విని, కృష్ణరాయలను వధింపుమని తిమ్మరుసున కాజ్ఞయిడెను. ఇప్పుడు మంత్రికి గొంతుకలో పచ్చివెలగకాయ చిక్కుకొన్నట్లైనది. రాజాజ్ఞ ! తానా ? సేవకుడు. రాజాజ్ఞను నిర్వహింపనిచో తనకు శిక్ష. రాజాజ్ఞను పరిపాలించినచో మునుముందు గొప్పవాడు కాగ లుగు ముఖలక్షణములుగల రాజకుమారుడు నిష్కారణముగ చంపబడును. అట్టివానిచావు రాజవంశమునకే కాక, రాష్ట్ర ప్రజలకునుగూడ తీరని నష్టమునకు కారణము. అందుచే బాగుగా విచారించి బుద్ధిమంతుడగు తిమ్మరుసును రెండవ కంటివాడెఱుగకుండ తనయింటనే యుంచి, రాజాజ్ఞానిర్వ హణ మొనరించినట్లు నరసరాజునకు విన్నవించెను. చతురు లగు మంత్రులచే రాజ్యముల కాయువుపట్టుగదా!

నరసరాజు గతించినవెంటనే వీరనరసింహరాయలు రా జయ్యెను. తిమ్మరుసు మంత్రిగనుండెను. అతడు కొలదికాలము పరిపాలించి గతించెను. వీరనరసింహునియనంతరము, మంత్రి

తిమ్మరసు కృష్ణదేవరాయలను విజయనగర రాజ్యమునకు పట్టాభిషిక్తుని జేసెను.

తిమ్మరుసు కృష్ణదేవరాయలను రహస్యమున రక్షించుచు సకలవిద్యావిషయములను స్వయముగ బోధించుచు తండ్రియై, గురువై, భ్రాతయై, ఇది యది యననేల ? సర్వము నను దానయై యుండెను. పరిభుభక్తిపరాయణుండగు తిమ్మరుసు వానిని వేయికండ్లతో గనిపెట్టుచు పెంచి పెద్దవానిగ జేసి రాజ్యార్హుని కావించెను. ఆ కృష్ణరాయలును తిమ్మరసును పితృభావముతోడనే సేవించుచు "అప్పాజీ" అనియే పిలుచుచుండెడివాడు. అట్టి పితృభావమునే తాను రాజైనను మంత్రియగు తిమ్మరుసుయెడ జూపెను.

రాయలు రూపమున రెండవమన్మథుడు కాకున్నను మొగమున గొప్పవర్చస్సుండెను. రాయలను బోలిన రాజు దక్షిణ హిందూదేశపురాజులలో నొక్కడునుగూడ లేకుండెను. బాహుబలమునగాని, బుద్ధిబలమునగాని సరిపోల్పదగిన రాజే లేడనుట వింతవిషయము కాదు. రాజ్యపాలనమునం దీడు లేని చేయి. పరిజల కష్టనిష్ఠురముల దెలిసికొనుటకై రేయి యనక, పవ లనక సర్వకాలములయందును నడుము కట్టుకొనియే యుండెను. ఇంతటి పరిభాపూర్ణుడయ్యును రాయలు

పితృతుల్యుడగు తిమ్మరుసు సమమతితోడనే తసపనుల నొనః
రించుచుండెను. ఇది ఆయన నిగర్వియనుటకు సాక్ష్యమేకదా!

రాయలు మతమున వైష్ణవుండు. రాజు వైష్ణవమతము
ననుసరించె ననినంతమాత్రమున నితరులమతస్థులను ద్వేషిం
చెనని చెప్పవలను పడదు. మతము వ్యక్తిగతము. అత డన్ని
మతములవారినిగూడ మిక్కిలి ప్రేమతో నాదరించుచు నే
నచ్చెను.

**నాటి రాజకీయపరిస్థితు లిట్లుండెను :**

కర్ణాటదేశమున కావేరీతీరమునందు శివసముద్రమను
నొక కోట గలదు. ఆ దేశపురాజులు కొంతకాలము విజయ
నగర రాజులకు గప్పము కట్టుచుండిరి. కాని, గంగరాజు రా
జ్యాధికారమును వహించినంతనే స్వతంత్రముగ వ్యవహరింప
సాగెను. ఈ పరిస్థితులను గమనించి కృష్ణదేవరాయ లొక
దూతను వానిదగ్గఱకు పంపెను. గర్వోన్మత్తుడైన గంగరాజు
రాయులదూతను వచ్చినదారినే పంపెను. ఇంతకంటె రాయుల
వారికి కోపకారణ మేమి కలదు ?

వెంటనే చతురంగబలంబులఁ గూర్చుకొని శ్రీరంగ
పట్టణపు చిక్కరాజును సహాయముగొని, దండు వెడలి గంగ
రాజు నోడించి కోటను వశపరచుకొనెను. గంగరాజీ యవ
మానమును సహింపఁజాలక కావేరీనదిలో బడి ప్రాణములను

విడిచెను. కృష్ణరాయల సార్వభౌమత్వమును చిక్కరాజంగీకరించెను. అనంతరము కూర్గు మళయాళము మొదలగు దేశములను జయించి వేర్వేరు సైన్యాధిపతుల నాయకత్వమున దక్షిణ దేశమునంతయు లోబఱచుకొనెను.

ఇట్లు దక్షిణ దిగ్విజయయాత్రను ముగించినయనంతర పూర్వదిగ్విజయయాత్రను సాగించెను. ముందుగ నెల్లూరు మండలములోని ఉదయగిరిని ఘోరయుద్ధమున లోబఱచుకొనెను. అనంతరము కనిగిరిపై దండెత్తి, రాజగు వీర రుద్రగజపతిం జయించి, యాతనిని పాఱద్రోలి యూతని కుమారియగు చిన్నాదేవిని వివాహమాడెను.

శత్రుంజయుడైన రాయలు తదనంతరము కొండవీటిపై దండెత్తెను. ఈ దుర్గము శత్రుదుర్గమమై వీరభద్రగజపతి పాలనలో నుండెను. కృష్ణరాయలు వీరమూర్తియై శత్రువుల జయించి దుర్గమును స్వాధీన మొనరించుకొనెను. ఈ సంగ్రామమున దనసేనానుల ధైర్యసాహసముల నెంతయు నభినందించి, వారిని దగురీతి సత్కరించెను. కొండవీటిరక్షకుడుగ గోపన్నమంత్రి రాయలచే నియమితు డయ్యెను.

పిదప రాయ లాంధ్రభూమియందలి అమరావతి, బెజవాడ, ధరణికోట, శ్రీకాకుళము మొదలగు పుణ్యక్షేత్రముల

దర్శించి, యాయాస్థలముల నపరిమిత దానధర్మముల నొన రించెను.

ఇట్లు పుణ్యక్షేత్రముల దర్శించినయనంతరము కొండ పల్లి కరుదెంచి మూడునెలలు ఘోరముగపోరి విజయలక్ష్మిని గ్రహించెను. అంతటితో విరమింపక కోనసీమతో జేరియున్న చిన్నచిన్నకోటల నన్నింటి నశ్రమమున స్వాధీన మొనరించు కొని రాజమహేంద్రవరమును లోబఱచుకొని, సింహాచల క్షేత్రమునందలి స్వామిని సేవించెను. ఇట్లుఖండపూర్వదిగ్విజ యమును కావించి స్వస్థానమునకు మరలి విజయోత్సవంబుల గావించి యానందమున కాలము గడుపసాగెను.

మరల కొంతకాలమునకు బీజపురసుల్తానును జయింప యుద్ధసన్నాహములను సాగించెను. తగిన సైనిక సంపదతో రణభేరీ మ్రోగించెను. సైన్యములు బీజపూరున కనతిదూర మందలి మలయపర్వతములదరి విడిసెను. ఈవార్త విని రాయ చూరుసేనాధిపతి రాయచూరుదుర్గ సంరక్షణప్రయత్నముల గావించి తానును యుద్ధమునకు సిద్ధపడి యుండెను. అంతలో రాయలసేనలు రాయచూరుకోటపై బడెను. కాని మూడు మాసములు ముట్టడించియు రాయలుసేన కోటను లోబఱచు కొనజాలకపోయెను. ఇంతలో బీజపురసుల్తాను సైనికులుగూడ వచ్చి రాయలసేనను ముట్టడించెను. సంకులసమర మయ్యెను.

రాయలసైనికులలో కొందఱు వెన్నుజూప సిద్ధపడిరి. అంతలో రాయలు తానే సేనలకు ముందునిల్చి వీరవిహార మారంభింప, పారిపోఁజూచిన సైనికులు తిరిగి సిగ్గుపడి యుద్ధమున కారంభించిరి. ఈయుద్ధమున తురుష్కు లోడింపబడిరి. బీజపుర మోడిపోయెను. తిరిగి రాయలు రాయచూరును ముట్టడించెను. రాయచూరును స్వాధీన మొనరించుకొనెను. శరణాగతుల రక్షించెను. కోటలోని జీర్ణభాగములను బాగుచేయించి తగిన సైనికబలమును కాపుంచి రాయలు విజయనగరమును చేరుకొనెను.

రాయ లీతీరున దిగ్విజయయాత్రను సమాప్త మొనరించెను. కృష్ణానదికి దక్షిణమందున్న దేశమంతయు రాయల యధీనములోనికి వచ్చెను. బీజాపురసుల్తానులు మొదలగువారల నోడించి వారలనుండి కప్పములగొనుచు రాయలు రాజాధిరాజై రాజ్యపరిపాలనమును సాగించుచుండెను. ధర్మబద్ధమైన యాతనిపాలనము నానాటి పోర్చుగీసువారే బహువిధముల వర్ణించిరి.

కృష్ణదేవరాయ లెంతటి బాహువిక్రమ సంపన్నుడో అంతటి విద్యాప్రియుడు. ఆతడు గొప్పకవి. ఆంధ్రభోజు డను నాతని బిరుద మాయన చేసిన సాహిత్యసేవకును, కవిపోషణమునకును ప్రబలదృష్టాంతము. రాయలు స్వయముగ విష్ణుచి

త్రీయ మను సద్గ్రంథమును రచించెను. దీనికే ఆముక్తమా ల్యద యను నామాంతరము కలదు. ఇతడు గీర్వాణభాష యందు సహితము ననేకగ్రంథముల రచించినట్లు రాయలే తన ఆముక్తమాల్యదలో వ్రాసికొనియున్నాడు

ఒకానొక కాలమున నొకానొక ప్రభువుచేసిన భాషా సేవ, ఆ భాషాచరిత్రయందు సువర్ణాక్షరములతో లిఖింపబ డును. ఆ సేవయే యా ప్రభువుల నమరులఁ జేయును. అట్లే యాంధ్రభాషాచరిత్రమును వ్రాయునపుడు రాయలొనరించిన యమూల్యసేవను వేనోళ్ళ గొనియాడక తప్పదు.

సంస్కృతమును భోజుడును, లాటిన్ భాషను అగస్ట సును, ఆంగ్లేయభాషను ఎలిజబెత్ రాణియు నెట్టి మహోన్నతదశకుఁ దెచ్చిరో యట్లే యాంధ్రభాషను కృష్ణదేవ రాయ లత్యున్నతస్థితికిఁ దెచ్చెను.

కృష్ణరాయలసభకు భువనవిజయ మని పేరు. ఆయన సభయందు పెక్కు రాస్థానకవు లుండిరి. వారి కష్టదిగ్గజము లని పేరు. కాని అందార్గురి కవుల నామములే నిర్వివాదము లుగ గన్పడుచున్నవి. 1. ఆంధ్రకవితాపితామహుఁడగు నల్ల సాని పెద్దన్న, 2. ముక్కు తిమ్మన, 3. మాదయ్యగారి మల్లన 4. ధూర్జటి, 5. అయ్యలరాజు రామభద్రుఁడు, 6. తాళ్ళపాక

చిన్నన్న. వీరుగాక, తెనాలి రామకృష్ణకవి, పింగళి సూరన్న రామరాజభూషణుడు, కమసాలి భద్రియ్య అనువారుకూడ కలరని వాడుక. కాని, చారిత్రకాధారముమాత్రము కాన్పించుటలేదు.

అల్లసాని పెద్దన కాంధ్రకవితాపితామహు డను బిరుదము నాంధ్రభోజుడే యొసంగెను. ఇతడు మనుచరిత్ర మను మహాకావ్యమును సృష్టించి, ఆంధ్రభాషామతల్లి కొక యపూర్వమును, నమూల్యమును నగు నలంకారము నొసగెను. దీని కెనయగు నుద్గ్రంథ మాంధ్రకావ్యముల నింకొకటి లేదు. శ్రీకృష్ణదేవరాయ లాగ్రంథము నంకితము నందుసమయమున నల్లసానవారిని బంగారుపల్లకిలో నూరేగింపజేసెను. ఆ పల్లకిని రాయలుకూడ మోసెనట! ఔరా! రాయల పండితాభిమానము! తన యాస్థానమునందలి సర్వోత్తమకవిని సన్మానించు సందర్భమున, మహాసభా మధ్యమున నుపవిష్టు జేసి గండపెండేరము నాతనిపాదమునకు స్వయముగ దొడగెను. కోకటము మొదలగు బహుళాగ్రహారముల నొసంగి సన్మానించెను. ఇట్లీతడు కవివరుల నందఱ నర్హరీతి సంభావించి మహోద్గ్రంథరచనమునకు బ్రోత్సహించెను.

రాయ లొక్కకవితాకళనేగాక తక్కుంగల లలితకళల కన్నింటికిని దగిన చేయూత నిచ్చి, సమస్తకళలను సక్రమముగ వికసింపజేసెను.

ఇట్టి మహారాజాధిరాజైన భూపతి మరల యేనాటికి జన్మించునా? ఈ ప్రపంచమున నెందఱు రాజులు పుట్టలేదు? రాజ్యముల నేలలేదు? వారలచరిత్రము వారలతోడనే నశించినది. కాని, శ్రీకృష్ణదేవరాయలు వీరులలో వీరుడు, పండితులలో పండితుడు, కళాప్రియులలో కళాప్రియుడు, నవరసరసికశిఖామణి. అమరసేవి. ఆంధ్రభాషా ప్రియుడు. ఆరాధ్యదైవము. ఆంధ్రీయుల ఆదర్శపురుషుడు.

కృష్ణరాయా! ఆంధ్రులు నిన్ను విస్మరింపఁజాలరు.





## 4. శ్రీ వీరేశలింగము

మదరాసురాజధానియందు నెల్లూరుజిల్లాలో కందుకూరను గ్రామము కలదు. ఆగ్రామమున రాజలింగ మను శైవ

బ్రాహ్మణు డుండెను. ఆగ్రామమునుబట్టియే రాజలింగము యొక్క యింటిపేరు కందుకూరివారని యేర్పడినది. రాజలింగమునకు చంద్రమౌళియను కుమారుడు కలిగెను. ఈచంద్రమౌళికి వీరేశలింగమను కుమారుడు జన్మించెను. ఈతడు పెద్దవాడైనపిదప స్వగ్రామమునువిడిచి యేలూరునం దుద్యోగమును సంపాదించెను. ఇతడు తన పూర్వులవలె సనాతనమతధర్మముల నంటిపెట్టుకొనియుండుట కిష్టపడక, కొంతసంస్కారము నభిలషించి, శైవాచారమగు లింగధారణమును మానివైచెను. పిమ్మట వీరేశలింగము రాజమహేంద్రవరమునఁ బ్రవేశించి, ధనమార్జించి మేడ నొకదానిని గట్టించెను. వీరేశలింగమున కిద్దరుకుమారులు. అందు రెండవవాఁడు సుబ్బరాయఁడు. సుబ్బరాయడు తన మేనత్తకుమార్తెయగు పున్నమ్మను వివాహమాడెను. ఈ సుబ్బరాయనికి క్రీ.శ. ౧౮౪౮ సంవత్సరము ఏప్రియలు ౧౬వ తేదీని మన కథానాయకుడగు శ్రీవీరేశలింగము పంతులుగారు జనన మందెను.

పాప మీతడు పసితనమునుండియు దుర్బలశరీరుడు. తఱచు రోగములచే బీడింప బడుచుండెడివాఁడు. ఈ చిన్ననాటి సుబ్బసమే యతని నామరణము బాధించుచుండెను. వీరేశలింగ మారునెలల శిశువై యుండగ మశూచివ్యాధి కలిగెను. దైవబలమున నావ్యాధినుండి గట్టెక్కెను. మహా

జ్ఞాపకశక్తి భవిష్యత్తు గలవాడగుటచేతనే పరమేశ్వరుడీతని కాపాడుచుండెను. ఇతనికి నాలుగవయేటపితృవియోగము కలిగెను. పెదతండ్రియే సంరక్షకుఁడయ్యెను.

తొలుత సీతడు వీధిబడిలోఁజేరి యానాటి యాచారమనుసరించి, అమరము, సుమతిశతకము, కృష్ణశతకము మొదలగువానిని గంతపాఠము చేసెను. అర్థము తెలియకుండగనే ధారణచేసిన ఆనాటిచదువు కాలక్రమమున నాతని కెంతయో తోడయ్యెను. అనంతర మీతడు ౧౮౬౭ సంవత్సరమున ప్రభుత్వపాఠశాలలోఁ జేరెను. రోగములు తఱచు బాధించుచుండినను, వానిని లెక్కసేయక విద్యాసక్తిగల మన వీరేశలింగము శ్రద్ధతోఁ చదువుకొనుచుండెను. తరగతిలోని బాలురలలోఁ నితడే మొదటివాడు. వీని కెనిమిదవయేటనే యుపనయనము కావింపబడెను, తదాది వీరేశలింగ మనుదినము త్రికాల సంధ్యావందన మాచరించుచు, దేవాలయముల కేగి ప్రార్థనలసలుపుచు, శైవసాంప్రదాయము ననుసరించి విభూతిని ధరించు సనాతన ధర్మనిష్ఠుఁడై యుండెను. పాఠశాలయందుమత్తముడుగ నుండి బహుమతుల నందుచుండెడివాడు. పదునైదేండ్ల వయసున వీరేశలింగమునకు మూడేండ్ల వయసుగల బాపమ్మనిచ్చి వివాహము కావింపబడెను. వివాహమైన తరువాత నామె పేరు రాజ్యలక్ష్మి యని మార్చబడెను.

వీరేశలింగము తల్లికిని, ఆమె జ్యోతికోడలికిని మనస్పర్ధలు దినక్రమమున వృద్ధిపొందినవి. వారిద్దరికిని నతుకుట లేదు. ఆకారణమున నా కుటుంబ మాస్తిపాస్తులను బంచుకొని వేఱైరి. దానితో కలహము లణంగినవి. ౧౮౬౮ నాటికి వీరేశలింగమునకు చక్కని భాషాజ్ఞాన మేర్పడి కవితాస్రవంతి జాలువారసాగెను. ఇరువదేండ్ల ప్రాయముననే శతకరచన మారంభించెను. ఆ సంవత్సరముననే సర్వకళాశాలాపరీక్ష కేగెను. కాని కృతార్థత నందలేదు. దేహారోగ్యము చెడెను. దానితో పాఠశాలచదువునకు స్వస్తి జెప్పి గ్రంథరచనము సేయ నారంభించెను అంతటి లేబ్రాయముననే నాంధ్రభాషలో నుదాత్తము లగు గ్రంథములను రచించెను. సరస్వతీకటాక్ష సంపన్నున కసాధ్య మేమి కలదు? కేవల గ్రంథరచనముతోడనే కాలము గడుపక నొక న్యాయవాదికడ నెల కిరువది రూప్యముల వేతనమునకుఁ బనిచేయ సాగెను. ౧౮౭౦ లో మరల సర్వకళాశాలా పరీక్షకుఁ బోయి యం దీతఁడు కృతార్థుఁడయ్యెను.

పరీక్షయం దుత్తీర్ణుఁడైన పిదప రాజమహేంద్రవరమునందలి ప్రభుత్వ పాఠశాలలో నుపాధ్యాయుఁడుగ జేరెను. ఆ యుద్యోగ మొనరించిన దొకవత్సరమైనను వీరేశలింగ ముత్తమోపాధ్యాయుఁడను పేరు గడించెను. అనంతరము న్యాయ

వాద వృత్తి నవలంబింప దలఁపూని తదుచిత పరీక్షకు జదివి గెలు పొందెను. కార్యదీక్షగల వానికి సాధింపరాని దే గియు లేదు.

వీరేశలింగము పంతులు గారిలో నొక గొప్పమార్పు కలిగెను. పూర్వాచారములు దోషభూయిష్టము లనియు, సర్వాచారములకు దమ మనసే ప్రమాణముకాని వేదశాస్త్ర పురాణములుకావనియు నాతని కొక దృఢవిశ్వాసమేర్పడెను. తన విశ్వాసమున కనుకూలముగ నానాటి పత్రికలలో వ్యాసములనువ్రాసి ప్రకటింప నారంభించెను. ఆయుపన్యాసముల కను కూలు రాయనను విశేషముగ కొనియాడుచుండిరి. అనంతర మున నాతఁడు భాషాంతరీకరణపరీక్ష కేగి యందు జయించెను. ౧౮౭౪ లో ధవళేశ్వరము [రాజమహేంద్రవరమున కంటి యున్న గ్రామము] నందలి యాంగ్లపాఠశాలలో నుద్యోగి యయ్యెను. ఈ పాఠశాలయం దీతఁడు ప్రధానాధ్యాపకుఁడుగ నుండెను. ఆ కాలమున స్త్రీవిద్యావిషయము లగు పెక్కు వ్యాసములు వ్రాసి పత్రికాముఖమున బ్రకటించుచుండెడి వాఁడు. ఆకాలమున స్త్రీలకు విద్య కూడదనువారు పెక్కు రుండిరి. ఆడువారు చదివి యుద్యోగముల జేతురా ? ఊళ్లేలు దురా ? యని వారివాదము. ఇట్టి కువాదముల నన్నిటికిని దగిన సమాధానముల నిచ్చెను. తిరిగి సంక్షిప్త లేఖన పరీక్ష యందు సహితముత్తీర్ణుఁడయ్యెను.

క్రమముగ వీరేశలింగమున కుద్యోగాసక్తి సన్నగిలి స్వతంత్రజీవితవాంఛ మొగ్గ దొడిగెను. రాజకీయోద్యోగము లన్నియుఁ బాపప్రసక్తికల వనియు, నుపాధ్యాయవృత్తియే గౌరవప్రద మైనదనియు నిశ్చయము గట్టిగ నమ్మి ప్రభుత్వపరీక్షలకుఁ బోవ మానెను. ౧౮౭౪ లో తన సంస్కరణాశయము లను ధారాళముగ వెల్లడించుట కనువగు "వివేకవర్ధని" యను వారపత్రిక నారంభించెను. ఆనాఁడు హిందూసంఘమున నెల కొన్న దురాచారములలోఁ బ్రముఖము లైనవి, గ్రాంథిక భాషావిముఖత, లంచగొండితనము, స్త్రీవిద్యావిహీనత మొదలగునవి. వీని నిర్మూలనమునకు వలయు సాధనములను తన పత్రికాముఖమున బ్రచారము సేయసాగెను. అప్పటికే వ్యాకరణమును, నీతిచంద్రిక యను గ్రంథములను వ్రాసెను. ఆ గ్రంథములను ౧౨౦౦ రూపాయలకు విక్రయించి, యొక ముద్రాయంత్రమును గొనుటకు బ్రయత్నించెను. తానొక్కఁడే కొనుట కష్టమని కొందఱుమిత్రుల నుమ్మడిగాఁ జేర్చి ముద్రాయంత్రమును గొని రాజమహేంద్రవరమున దానిని నెలకొల్పెను. ముద్రాయంత్రము లభించినపిమ్మట తనవివేక వర్ధనిని "పక్షపత్రిక"గ మార్చి "హాస్యసంజీవని" యను మఱి యొకపత్రికనుగూడ ప్రకటింపసాగెను. ౧౮౭౬ లో రాజ మహేంద్రవరమున రాజకీయ శాస్త్రపాఠశాలలో నధ్యాపకు

ముగ జేరి, యధ్యాపకత్వమును, పత్రికా సంపాదకత్వమును నిరంతరాయముగ సాగించుచుండెను. పత్రికాముఖమున నధికారుల లంచగొండితనమును నిర్భయముగ మోటమిలో ఖండించుచుండెను. ఆ రచనలు లంచగొండులకు నధికారులకు గుండెలలోని గాలము లైనవి. పెక్కురు వీరేశలింగమునకు విరోధులైరి. ఈమాత్రమునకు జంకువాడా మన వీరేశలింగము! అతడు గుండెలుదీసినబంటు. తన ప్రచారమును యథాపూర్వముగ సాగించుచునే యుండెను. వీనికిదోడు ప్రార్థన సమాజము నొకదానిని తనయింటనే స్థాపించెను. రాత్రి పాఠశాలలను స్థాపించి బీదసాదలకు విద్యాభిక్ష నొసగుచుండెను. ఈ రీతిగ వీరేశలింగముపంతులుగారు పరోపకార జీవితమును సాగించుచుండెను.

సంఘసంస్కరణముతోడనే తన జీవిత శేషము గడుప నిశ్చయించి పత్రికలద్వారా తనభావములను నిర్భయముగ బ్రకటించుచు, తన కెదురు జెప్పువారినోళ్ళు మూయించుచు తనపై తేబడిన యభియోగముల గాల దన్నుచు కాలమును గడుపుచుండెను. ఆ నాటికి దేశమున గల బాల్యవివాహములను, వృద్ధవివాహములను, కన్యాశుల్కములను మున్నగు సాంఘికదురాచారములను సాహసవృత్తి నెదుర్కొనుచుండెను. స్త్రీవిద్యాభివృద్ధి కెంతయు బ్రయత్నించుచుండెను. బాల విధ

వల కడగండ్లు వీరేశలింగముగారి హృదయమును ద్రవింపఁ జేసెను. అందుచే వితంతువివాహ సంస్కరణమునుకూడ తల పెట్టెను.

ఈ నూతన సంస్కరణాభిలాషమును వెల్లడించినంత నే సనాతనాచారములయం దాదరముగల పండితులకు దేళ్ళను జెఱ్ఱులను ప్రాకినట్లాయెను. అంత నా పండితులంద రాతని నేకముఖమున నెదిర్చిరి. ఇట్టి ప్రతిఘటనము నాతఁడు తొల్త నే యెఱింగినవాఁడు గనుక దాని నాతఁడు లెక్క సేయ లేదు. ఏసంస్కరణమును సర్వజనాంగీకారము కాదుగదా! పంతులు గారు "స్త్రీపునర్వివాహ సమాజము" నొకదానిని స్థాపించి, దాని యాజమాన్యమున ౧౮౮౧ లో నొక పునర్వివాహ మును జరిగించెను. కాని యాపెండ్లి కెన్ని యోయాటంకముల సనాతనులు కల్పించిరి. ఆయాటంకముల లెక్కసేయక రక్షక భటసహాయమున దాని నిర్వహించెను. మనసున్న మార్గము లేదా? వీరేశలింగము కులబహిష్కృతుఁడు కావింపబడెను. ఈ బహిష్కార తిరస్కారము లా ధీరుని సంకల్పవిముఖుని గావింపజాలునా?

రాజమహేంద్రవరమున నొక "పురమందిరము"ను నిర్మింప దలంచి పౌరు లెవ్వరును ధనసహాయ మీయమి

సొంతధనముతోడనే నిర్మింపజేసెను. పురజనులసహాయమున ప్రార్థనామందిరమును గూడ కట్టించెను. ఆ దినములలోనే వీరేశలింగము మొనరెంచిన ప్రజాహిత కార్యములను మెచ్చి "రావుబహదూర్" బిరుదమును నొసంగి ప్రభుత్వము గౌరవించెను.

౧౮౯౭ సంవత్సరమున రాజమహేంద్రవరము వదలి మదరాసునగర నివాసమునకై వీరేశలింగము పంతులుగారు ప్రయనమై పోయిరి. అచ్చట "చింతామణీ" ముద్రాక్షరశాలను స్థాపించి తన కార్యక్రమమును సాగించెను. వితంతు వివాహములనుగూడ జరిపించెను. వీరేశలింగముగారి యిల్లు వితంతుశరణాలయ మయ్యెను. కొంతకాలమునకు మదరాసు ప్రభుత్వకళాశాలలో నాంధ్రాచార్యపదవి నందెను. ౧౮౯౮ సంవత్సరమున మదరాసునందలి సాంఘికమహాసభ కధ్యక్షుడయ్యెను. తరువాత నాంధ్రదేశమున జరిగిన సాంఘికసభలకుగూడ నీత డగ్రాసనాధిపత్యమును వహించెను. మదరాసున స్త్రీలకొఱకు నొక పాఠశాలామందిరమును నిర్మించెను. ౧౯౦౫ సం॥లో మదరాసును వదలి తిరిగి స్వస్థానమగు రాజమహేంద్రవరమును చేరెను.

రాజమహేంద్రవరమును చేరినవెంటనే బాలికాపాఠశాల నొకదానిని స్థాపించి దానికి "విక్టోరియా బాలికా పాఠ

శాల"యని నామకరణ మొనరించెను. ఈ పాఠశాల క్రమ
ముగా వృద్ధికాగా ప్రత్యేకభవననిర్మాణమునకై రొక తో
టను గొనెను. ఆ తోటలోని జీర్ణగృహమును బాగుచేయించి
ఉదారజనుల సహాయమున రెండు నూతనగృహముల నిర్మిం
చెను. ప్రతియింట దానుండి కొత్తయింటను పాఠశాల
కుపయోగించెను. అటుపిమ్మట "సత్యవాదిని" యను బత్రిక
నారంభించి ప్రతిపక్షులవాదముల ఖండించుచు, స్వవాదముల
బలపఱచుచు వ్యాసముల బ్రకటించుచుండెను. కాని వ్యయ
భారము దుర్భర మగుటచే ముద్రణాలయము నమ్మివేసి
పత్రికాప్రచురణము నాపివేసెను.

౧౯౦౭ లో వీరేశలింగ మొక యున్నతపాఠశాలను
స్థాపించెను. దాని నిర్మించుట కఱువదివేలరూప్యములయ్యె
నట. ఈ ధనమునంతయు శ్రీ పీఠికాపురప్రభుగారు దానముగ
నొసగెను. మదరాసురాష్ట్రమునందలి యుత్తమపాఠశాలగ
నయ్యది నేటికిని సాగుచున్నది.

౧౯౧౦సం॥లో పంతులుగారికి కళత్రవియోగము సంభ
వించెను. సహధర్మచారిణి గతించుటచే పంతులుగారి గుండె
జారెను. కాని గుండెదిటవు పఱచుకొని స్వకార్యాభిముఖు
డయ్యెను.

వీరేశలింగకవి జీవితమున నొనర్చిన సాంఘికసంస్కరణములు సర్వజనాంగీకారము నందకున్నను నాతఁ డొనరించిన భాషాసేవమాత్ర మేకగ్రీవముగ బ్రశంసింపఁబడినది.

ఇరువదేండ్లవయసునందే జాలువారిన యాతని కవితా స్రవంతి మునుముందు శతకరచనమునకు దారితీసినది. అనంతర మచ్చతెనుగున నైషధము, అచ్చతెనుగు రామాయణమున నుత్తర కాండము, భారతసంగ్రహము అను గ్రంథములను వ్రాసెను. పెక్కు పద్యకావ్యముల రచించెను. ఇందు కొన్ని సంస్కృతమునుండియు, కొన్ని యాంగ్లేయమునుండియు ననువదింపబడినవి.

కేవల పద్యరచనముతోడనే తృప్తినందక వచనరచన కుపక్రమించెను. నీతిచంద్రికలోని సంధివిగ్రహములను మధుర శైలిలో వచనరూపమున వ్రాసెను. ఆంధ్రభాషలో తొలి నవల యగు "రాజశేఖరచరిత్రము"ను రచించి ప్రజామోదము నందెను ఈగ్రంథ మాంగ్లేయ, కర్ణాటకభాషలలోనికి కూడ పరివర్తనము కావింపబడినది. స్త్రీజనోపయోగమునకు "సత్యవతీచరిత్ర"మను వచనగ్రంథమును రచించెను.

సంస్కృతమునుండి తెనుగుచేయబడిన శాకుంతలము, ప్రబోధచంద్రోదయము లను నాటకములే గాక, స్వతంత్ర

నాటకములగు ప్రహ్లాదాదులెన్నియో కలవు. ఆంధ్రభాషలో నపూర్వములగు ప్రహసనములను, జీవచరిత్రలను, స్వీయచరిత్రను రచించి ఆంధ్రవాఙ్మయమున నెన్నియో యపూర్వ శాఖలను వెలయించెను. బాలురకొఱకు సంగ్రహవ్యాకరణమును వెలయించెను. ఈ కవిచంద్రునిరచనలలో తలమానిక మనదగినది "ఆంధ్రకవులచరిత్రము." ఈ కవులచరిత్రను రచించుటకా మహనీయు డెన్నిగ్రంథముల బరిశీలించెనో, ఎంత ప్రయాసపడెనో చెప్పుటకు వీలుకాదు. ఈ మహాశయుని రచనముల శతమునకు బైమాట. ఇందొక్కటియు బనికిరానిది లేదు.

ఇంతటి భాషాసేవ చేసిన వీరేశలింగకవి "నవయుగనిర్మాత" యని వినుతింపబడుచున్నాడు. అసమవచనరచనాచణుండైన పంతులుగారికి "గద్యతిక్కన" యను బిరుదమును గలదు. ఈత డెంతటి విద్యాపరిపూర్ణుడో యంతటి వినయధురీణుడు. నిముసమేని వ్యర్థముసేయక తనకాలము నంతయు దేశ—భాషాసేవలకై వినియోగించిన యుత్తమ త్యాగమూర్తి మన పంతులుగారు.

సత్యమును వచించుటకు జంకని దిట్ట. ఇతరుల నాగ్రహానుగ్రహములకు దోయిలించని ధీరుడు.

ఈ మహాపురుషుడు ౧౯౧౯ సంవత్సరమున నస్థిరమైన తన భౌతికశరీరమును విడిచి సుస్థిరమైన యశఃకాయమును ధరించెను. వీరేశలింగ మమృతమూర్తి.



# 5. శ్రావణుఁడు

పూర్వము మధురాపురమున విశ్వనాథు డను వైశ్య శిఖామణి యొక డుండెను. అతడు ధనవంతుడు; దానశీలుడు. వానియిల్లా లన్నపూర్ణ సుప్రసిద్ధమైనది. ఆమె పేరుకూడ నన్నపూర్ణ. అన్నపూర్ణ సర్వసద్గుణసంపూర్ణ. చిన్ననాటినుండియు బరుల మృష్టాన్నసంతృప్తుల గావించుట యన్న నిష్టము మెండు. నిరతాన్నదానశీలు రగు నా దంపతుల ప్రాగ్జన్మ పుణ్యవిశేషమున పితృభక్తిపూర్ణుఁ డగు శ్రావణుఁ డను కుమారుఁడు జనన మందెను. ఆహా! ఆ కుటుంబ మెంతయదృష్టవంతమైనది! సాధారణముగ లోకమున దంపతులయం దొకరు సాధువులైన రెండవవా రసాధువు లగుటయు, దైవికమున నిరువురు సత్తములైన సంతానము వేదనాపాదకమైనదిగ నుండుటయు మనము చూచుచుందుము. కాని, యీ కుటుంబమునం దెవరిని వేలెత్తి చూపుట కవకాశమే లేకుండెను.

ఇట్లుండ శూరసేన దేశమున ఘోరదుర్భిక్షము పొడచూపెను. దినక్రమమున క్షుధార్తుల మరణసంఖ్య మేరమీఱుచుండెను. పండుటాకులవలె జను లాకలిబాధ కోపలేక రాలిపోవుచుండిరి. ఈ భయంకర వార్తాశ్రవణ మన్నపూర్ణహృదయము నుఱ్ఱూత లూగించెను. వెంటనే భర్తచెంత కేగి

పాణిపద్మముల జోడించి, "నాథా! ఏంటిదా? దినములు కెన్ని
ప్రాణముల నా కామదేవత పొట్టబెట్టుకొనుచున్నదో! ఇంత
యుండి తోటివారలను "అన్నమో రామచంద్రా" యని వాపో
వుండ మనము హాయిగ తిని పరుండుటయా? భగవంతుడు
మనకు విత్తమొసంగినది త్యాగశీలురమై సద్వినియోగ మొన
ర్చుటకుగాని ముల్లెగట్టి మూల దాచుటకా? కావున నేటి
నుండియే మన మన్నదానదీక్ష కుపక్రమింతము" అని పలికెను.

అర్ధాంగిహితోపదేశము నమృతోపమానముగ నీశ్వ
నాథుండు భావించి, తన సంపూర్ణాంగీకారమును వెలిబుచ్చెను.
అన్ని దానములలో ప్రతిగ్రహీతను తృప్తి పరచునది యన్న
దానము.

ఈ దంపతుల యన్నదానదీక్షావార్త వాయువేగమున
క్షామపీడితుల చెవి జేరెను. వెంటనే వేలకొలది క్షుద్బాధితులరు
దెంచి, ఆ దంపతు లొసంగెడి యమృతసమాన మగు నాహా
రమును భుజించి తమ ప్రాణదాతల హృదయపూర్వకముగ
దీవించి పోవుచుండిరి. ఈ విధమున వారి యన్నదానవ్రతము
పండ్రెండువర్షము లవిచ్ఛిన్నముగ సాగెను. వారియాస్తియం
తయు కర్పూరమువలె హరించిపోయెను. అతిథిజనసంతృప్తి
గావించినందున గలిగిన యానందమున నా దంపతులు తమ

నాస్తి యగుట కొంతయు విచారింపలేదు. కొలది దినములలో వారు నిరుపేద లైరి.

ఒకనాడు రాత్రి మూడవర్షామున నలుగు రన్నాతురు లా యింటిముందుకు వచ్చి. "అమ్మా! ఆకలి - ఆకలి"యని యాక్రందన మొనరింపసాగిరి. వెంటనే యన్నపూర్ణ వారిని లోనికి గొనివచ్చెను. కాని వారియి ల్లయ్యవారి నట్టింటివలె నుండెను. ఈ యన్నాతురుల ప్రాణముల నెట్లు నిలబెట్టుటా? యని యాసాధ్వి కంటికి కడివెడుగన్నీరు కార్చెను. చేత నొక చిల్లిగవ్వయైన లేదు. ఆఁకొన్నవారి కన్నము బెట్టజాలని జీవితము వ్యర్థముగదాయని భర్తతోగూడ ప్రాయోపవేశమున ప్రాణములను బరిత్యజింప నిశ్చయించెను.

శ్రావణు డిది చూచి "అమ్మా! ఏల పరితపింతువు. నీ మంగళసూత్రమహిమచే నీ వీ యన్నాతురుల కన్నము నొసంగగలవు; వగవకు" మని యోదార్చెను. కుమారుని 'మంగళసూత్ర' మనుమాట వినగనే యాపె తెప్పరిల్లి యుదయముననే నా మంగళసూత్రము నమ్మి, భోజనసామగ్రులను దెప్పించి, వారల కన్నము పెట్టి పున్నెము మూటకట్టుకొనెను. స్థిరసంకల్పులకు భగవంతు డే విధముననో సాయపడునుగదా!

అన్నపూర్ణా విశ్వనాథులను వార్ధక్యము వరించెను దానికితోడు గ్రుడ్డితన మలముకొనియెను. శ్రీవణుడు మధుకరవృత్తిచే తల్లిదండ్రులను బోషించుచు సమస్తవిధోపచారముల వారిసేవ చేయుచుండెను. పుత్రులకు మాతాపితృసేవకు మించిన యుత్తమధర్మమే లేదుగదా! తల్లిదండ్రులు కాశీపురమున కేగ తమకు గోరిక కలదని కుమారున కెఱిగింప నాతడు వెంటనే పిత్రార్జితమగు నింటిని విక్రయించి, తద్ధనముతో గావడిని, తట్టలను, మట్టులను కొని - కావిబట్టలను ధరించి జననీజనకులను కావడిలో కూర్చుండబెట్టుకొని పుణ్యక్షేత్రములకు బయనమయ్యెను.

ఇట్లాతడు వింధ్యాటవీమధ్యమున బయనము కావింపుచుండ కొందఱుదొంగ లెదుర్కొనిరి. వారిని జూచినంతనే ప్రశాంతచిత్తమున శ్రీవణుడు "నాయనలారా! నాదగ్గఱ ధన కనక వస్తువాహనములు లేవు. వీరు నా తల్లిదండ్రులు. వృద్ధులు; అంధులు. వారిని సేవించుచు పుణ్యక్షేత్రముల జూడ బోవుచుంటిని" అని యన నా దొంగలమనస్సు మారిపోయెను. వారు వెంటనే "అయ్యా! నీవు మాకు ధర్మోపదేశ మొనరింపుము" అని వేడుకొనగ శ్రీవణు డలరి "నాయనలారా! పరుల హింసించిచేయు జీవనముకంటె, పరుల రక్షించుటకై ప్రాణముల నర్పించు టుత్తమము. మానవుడు

స్వార్థమును విడచిననేగాని పరమార్థసంపాదనమున కర్హుడవు కాదు. దినదినగండ మనదగు నీ దొంగతనమును మానుము. ఈశ్వరు నారాధింపుము" అని హితోపదేశము గావింప, వా డట్లొనర్ప బ్రమాణ మొనరించి కొండగుహాలలో తాము దాచినధనమును దెచ్చి గురుదక్షిణగా సమర్పించెను. శ్రావణుడు దాని నిరాకరించి, మీ రీధనమును బీదలగువారి పోషింప వినియోగింపుము. మానవసేవయే మాధవసేవయను సిద్ధాంతము విశ్వసించి, దాని నాచరణలో నుంచుము. అదియే నాకు మీ రీయదగిన గురుదక్షిణ - అని చెప్పి ముందునకు సాగిపోయెను.

ఆ దొంగ లాప్రదేశమునకు శ్రావణా శ్రమ మని పేరిడి వచ్చిపోయెడి బాటసారుల కన్నదాన మొనరించుచు సుఖజీవితమును సాగించుచుండిరి.

శ్రావణుడు కతిపయదినంబులు ప్రయాణ మొనరించి యొక సాయంకాలమున విశాలపురి జేరెను. ఆయూర నొక యింటిబయట నున్న వీథియరుగుపై జననీజనకుల గూర్చుండ జేసి, మార్గమధ్యమున వానకుదడిసిన వారిబట్టల దీసి, వారికి పొడిబట్టల గట్టబెట్టెను. ఆ వృద్ధదంపతులు చలికి గజగజ వణకసాగిరి. శ్రావణుడు బజారున కేగి ఫలంబుల దెచ్చుటకు సిద్ధపడెను. అంత నా ముసలిదంపతులు "నాయనా

స్నానము చేయనిదే ఫలహార మెట్లు చేయుదుమురా?" అని యనిరి. ఆ మాటలు విని శ్రావణుడా యింటితలుపు తట్టి "కొంచె ముష్ణోదక మీయగలరా?" యని యడిగెను. తత్క్షణమే యా యింటియామె వచ్చి యా ముదుసలుల జూచి, దయార్ద్రహృదయయై లోనికి రమ్మని యాహ్వానించి వేడి నీట స్నానమును చేయించెను. ఆహా! భారతభూమి అతిథి సేవకు బెట్టినపేరుగదా! అంత నా యిల్లాలు శ్రావణునిజూచి "కుమారా! పార్వతీ పరమేశ్వరులవంటి నీ తల్లిదండ్రులకు మాకుకలిగిన కలియో గంజయో యింత భక్తితో నిచ్చెదము. మా ఆతిథ్యమును స్వీకరించి నన్ను ధన్యురాలను కావింపు" మనెను. అప్పుడు శ్రావణుడు "అమ్మా! వారణాసి మొదలగు దివ్యక్షేత్రములను, గంగాది పవిత్రనదులను దర్శించుటవలన గలుగు ఫలముకంటె మీవంటి సతీరత్నముల దర్శనము వేయంతలు ఫలప్రదము. మీ అతిథి సేవాసక్తి నెంతని కొనియాడుదును!" అని యనెను. అప్పుడా సాధ్వి 'నే నెంత? నా సేవ యేపాటిది? మధురాపురమునందలి యన్నపూర్ణా విశ్వనాథుల నిరతాన్నదానము ముందు నా దొక లెక్కయా? లక్షలకొలది ప్రాణుల రక్షించిన యా పుణ్యదంపతుల కాలి గోటికేని చాలని నన్నింత కొనియాడకుము' అని చెప్పెను. అంత శ్రావణు డాయువతితో 'అమ్మా! వీ రే అన్నపూర్ణా

విశ్వనాథులు ! నేను నాతొలిజన్మంబునందలి పుణ్యావశేషము వలన వీరిగర్భమున జనించితిని' అని చెప్పినంతనే సంతోష పులకితశరీరయై యా యువతి వారలకు సాష్టాంగ నమస్కారములు నొనర్చి 'ధన్యోస్మి; ధన్యోస్మి' అని వారల ననేకభంగుల వినుతించెను. అనంతర మాదంపతులు నామె యాతిథ్యమును గ్రహించి సంతుష్టులైరి. అటనుండి తెల్లవారకమున్నె మహాకాళమునకు వెడలిరి.

మహాశివరాత్రినాడు శ్రవణుడు తల్లిదండ్రుల కాళేశ్వరారాధనమునకై మహాకాళమునకు జేర్చెను. ఆనాడు శ్రవణుడు తలిదండ్రుల కాళేశ్వరాలయమునకు దీసికొనిపోయి స్వామి దర్శనమును చేయించెను. ఆహా ! శ్రవణుడు ధన్యజీవి !

అనంతరము వారు జ్యోతిష్మతీపురమును చేరిరి. శ్రవణు డాయూర ననుదినము శివలీలాగానము నొనరించుచు పురవీథుల దిరిగి దైవకృపాలబ్ధమయిన పదార్థములతో జననీ జనకుల బోషించుచు కాలము గడపుచుండెను. ఒకనాడు యథాపూర్వముగ నుదయమున శివలీలాగానము సేయుచు, రాజవీథినుండి పోవుచుండగ, కోసల రాజపుత్రిక యగు నిందిర శ్రవణునిగానమాధుర్యమునకు ముగ్ధయై వానియం దనురాగము కలది యయ్యెను. వెంటనే చెంతనున్న చెలి

కత్తియగు కాతని యుదంతము నెఱిగి రమ్మని యాదేశించెను. వెంటనే చెలికత్తియయగు పద్మయు శాలివాహనుని యుదంతము నంతయు గ్రహించి రాకుమారితో నిట్లనెను. "అమ్మా! ఆ మునిసుతుడు దాకసత్రమున నున్నాడు. తల్లిదండ్రులు వృద్ధులు. దానికిదోడు గ్రుడ్డివారు. అతడు పితృసేవాసక్తిగల బ్రహ్మచారి. పరనారీవిముఖుడు" అనెను. ఆమాటలు విని రాజకుమారి తల్లిదరికఱిగి తనమనోభీష్టము నెఱిగించెను. రాణియు కూఁతునందలి వాత్సల్యమున భర్తతో జెప్పి తత్ప్రయత్నమును గావింప వేడుకొనెను. రాజగు మయూరుడు శాలివాహనుని బిలిపించి వానివృత్తాంతము నెఱింగి, కుమారితో నిట్లనెను. "అమ్మా! క్షత్రియకుమారి గర్భదరిద్రుడగు వైశ్యబాలుని వరించు టెందేని వింటిమా? దాంపత్య మనురూపమైననేగదా శోభించుట"?

అప్పు డిందిర "తండ్రి! నేను ప్రేమించిన దా ముని కుమారుని యాత్మనుకాని శరీరమును కాదు. కులవిభేదములు శరీరమునకుగాని యాత్మకు కాదు. నేనాతని సుగుణసంపదను వరించితిని. కాబట్టి నా కోరికను నిరాకరింపవలదు"అని సమాధాన మొసగెను. మయూరుడు కృతనిశ్చయయగు కుమార్తె మాటల ద్రోసివేయక మంత్రిముఖమున రాయబార మంపెను. శాలివాహనుడు, వచ్చిన మంత్రిసత్తమునితో "ఆర్యా! నాకు

నఘ. తలంచినంతనే తాతపెండ్లియన్నటుల, తీవ్రిపడి వివాహ ప్రయత్నము చేయరాదు, కులమర్యాదల నతిక్రమించుట కులకన్యలకు కూడనిధర్మము. కావున నా హితవాక్యముల నాలోచించి నీ కనురూపు డగు రాజకుమారుని జేపట్టి యుచిత రాజభోగముల ననుభవింపుము ; పొమ్ము" అని శ్రావణుఁడు నిష్కర్షగా బలికెను.

ఈ పెండ్లివ్యవహారములను శ్రావణుని మాతాపితలు విని రాకుమారిని బెండ్లియాడి జీవితశేషమును సుఖముగ గడుపుకొనుమని కుమారునకు బోధించిరి. వారలకుఁ దగు సమాధానముల జెప్పి వారల నంగీకరింపజేసి, వెంటనే యా పురమును విడి తల్లిదండ్రులను మోసికొనుచు నుత్తర కోసల మహారణ్యమార్గముల బయనము సాగించెను. మార్గమధ్య మున నన్నపూర్ణకు దాహమగుటచే నామె తన కెచ్చటనుండి యేని పానీయంబుల గొనిరమ్మని కుమారు నడిగెను. శ్రావణు డంత జననీజనకుల నొక చెట్టుక్రింద దింపి, సమీపమునం దున్న సరయూనదీప్రాంతమున కేగెను. నదీజలంబులయందు ఘటంబును ముంచుచుండ బుడబుడ శబ్దమయ్యెను. అచ్చట కనతిదూరమున నస్త్రాభ్యాస మొనరించుచున్న దశరథనరేం ద్రుడీ శబ్దమునువిని యదియొక గజమని తలంచి, బాణప్రయో-

గము గావించెను. వెంటనే యా శరము శ్రావణుని యుర మునఁ దాకెను. తగులుట యేతడవుగ పిపాసార్దితయగు మాతృ మూర్తిని దలంచుకొనుచు "హా! తల్లీ!"యని నేలగూలెను.

ఈ యార్తధ్వనిని వినినంతనే దశరథుఁడు దదరిపడి నదీ తీరమున కేతెంచెను. కాషాయవస్త్రధారియును, శరపీడితుఁ డును నగు సాధునందనుని జూచి "అయ్యో! ఎంతటి యకార్య మొనరించితిని? మునికుమారా! క్షమింపుము"అని చేర జని యెను. అంత శ్రావణు డాతని జూచి "దైవగతికి విచారించిన ఫలములేదు. నేను మునికుమారుఁడను కాను. నీకు బ్రహ్మ హత్యాదోషము లేదు. కాని వృద్ధులును, అంధులును, అనన్య గతికులును నగు నా జననీజనకులకు దిక్కెవ్వరాయనియే నా హృదయతాపము. కానిమ్ము, ఆలసింపక నీ నీరమును గొని పోయి దాహపీడిత యగు నాతల్లి కొసగి, వారికి నావార్త తెలు గింపుము. ఈ బాణబాధ దుర్భర మగుచున్నది. నీ వందు కరుణించి దీని నూడ బెఱుకుము"అని చెప్పెను. దశరథుఁ డట్లే యొనరింప నాతడు 'శ్రీహరీ'యని యసువుల విడచెను.

దశరథు డాతనిమృతి కెంతయేనియు జింతించి జలకల శమును చేబూని యా వృద్ధదంపతులకడ కేగెను. జలమును దెచ్చుట కరిగిన తమతనయు డింతతడయుట కేమి కారణమూ

యని యా ముసలులు పరిపరివిధంబుల దలంచుచు. విచా
రించుచుండిరి. ఇంతలో మనుజునియలికిడి విని యన్నవృద్ధు
"కుమారా! నేనుపూ ? ఏదీ జలము" అని యడిగెను. ఆ
మాటలకు దశరథు డేమియు మారుబలుకక, "అయ్యా! సి.
రివిన్నా! దాహశాంతి జేసికొనుము" అనెను. కంఠధ్వనినిబట్టి
యాతడెవడో నూతనపురుషు డగుట గుర్తించి "అయ్యా!
నీ వెవ్వడవు? జలార్థమేగిన నా ప్రియసుతు డేడీ? ఆలసింపక
తెలియబలుకుము. వానివార్త తెలియువరకు నే నీ నీరమును
ముట్టను"అని యనెను. అంత దశరథుడు గడిచిన వృత్తాంత
మును నివేదించెను. పిడుగువంటి కుమారుని మరణవార్త విని
నంతనే యావృద్ధులు "అయ్యో! కుమారా!" అని మూర్ఛి
ల్లిరి. దశరథుని శైత్యోపచారముల గొంత తెప్పరిల్లి, కుమా
రునికొఱకు కంటికి మంటికి నేకధారగ నేడ్చుచు, మమ్మాతని
దేహముకడకు గొనిపొమ్మని దశరథుని వేడిరి. అత డట్లే
యొనరించెను. తనయుని శరీర మాపాదమస్తకము దడవి
బోరున నేడ్చిరి. దశరథుడు సాంత్వనవాక్యముల ననునయిం
చెను. గర్భశోక మిట్టి యుపచారవాక్యముల దీఱునా? తద
నంతరము విశ్వనాథుడు, "రాజా! నిష్కారణముగ నా
కుమారుని జంపి, మమ్ము సుతవియోగ దుఃఖసముద్రమున
ముంచితివే! కాని మీ్మాయశు మూరకబోదు, మా వలెనే

నీవును పుత్రవియోగశోకముచే విలపించుచు నసువుల విడిచె దవుగాక !" యని శపించెను.

తదనంతరము విశ్వనాథుడు కుమారునకు దహనసంస్కార మొనరించెను. అటుపిమ్మట దశరథునిజూచి "రాజా ! నేము ప్రాయోపవేశమున దేహత్యాగ మొనర్తుము. మాకగ్నిసంస్కారము చేసిపొ"మ్మని, వా రట్లొనరింప, దశరథు డా దంపతులకు దహనసంస్కార మొనరించి స్వపురాభిముఖుండై పోవుచుండెను.

జ్యోతిష్మతీపురంబున నిందిరాకుమారి శ్రావణు డెచ్చటికో యుత్తరదిక్కుగా నేగెనని చెలిముఖంబున విని, వెంట నే యొకగుఱ్ఱము నెక్కి వారల వెదకికొనుచు తెల్లవారునప్పటికి సరయూతీరమునకు వచ్చెను. మార్గమున ఖిన్నవదనుడై పోవు దశరథునిగాంచి, వానివలన వారలవృత్తాంతమును విని మొదలు నఱుకబడిన యరటిచెట్టువలె నేలగూలెను. దశరథు డాయువతికి దగు శైత్యోపచారముల గావించెను. అప్పు డా యువతి తెలివిగొని "అయ్యా ! నా కా ప్రదేశమును జూపు"మని యడిగెను. ఆ నరపతి యా ప్రదేశమున శావముబలను గొనిపోయెను.

రాకుమారి యగు నిందిరాకుమారి, గుండె రాయిజేసి సరయూజలమున స్నానా మొనరించి, శ్రీవణుని చితికి ముమ్మారులు ప్రదక్షిణ మాచరించి "ఓ కాత్యాయనీ ! లోకమాతా ! నాకు మఱుజన్మమునగూడ శ్రీవణునే పతిని జేయుము" అని మండుచున్న చితిలోబడి భర్తృసాలోక్యము నందెను.

ఓహో ! పతివ్రతామతల్లీ ! ఇందిరా !

నీకు నమస్కారములు.



# 6. రాణీ సంయుక్త

ఉత్తర హిందూస్థానమున ఇంగ్రేజువారి రాజ్యాంతమున
చే కొన్నికగన్న సంస్థానములలో అజమీరు సంస్థాన మొక
టియు, కన్యాకుబ్జసంస్థాన మొకటియు గలవు. అందజమీరు
పాలకుడు సోమేశ్వరుడు. కన్యాకుబ్జాధీశ్వరుడు విజయపా
లుడు. వీ రిరువురును గొప్పవీరులుగనే పరిగణింపబడుచుండిరి.
వీరల కనంగపాలుడు తన పెద్దకుమార్తెయగు కమలాదేవిని,
చిన్నకుమార్తెయగు విమలాదేవిని యొసంగి క్రమముగ
వివాహముల గావించెను.

సోమేశ్వరునకు పృథ్వీరాజును, విజయపాలునకు జయ
చంద్రుడు నను కుమారు లుదయించిరి. అనంగపాలు డపు
త్రకు డగుట తన యనంతరమున ఢిల్లీసామ్రాజ్యాధినేతగ
పృథ్వీరాజును నిర్ణయించెను. పెద్దకుమార్తెకు కుమారుడగుట
నాతడే తగినవాడని యా ప్రభునినిర్ణయము. కాని, రెండవ
దుహితయొక్క కుమారుడగు జయచంద్రుడు వయసున బెద్ద
వాడగుట తానే ఢిల్లీచక్రవర్తి పదమున కర్హుడననియు, తాత
గా రొనరించిన దన్యాయ మనియు వివాదమును లేవనెత్తెను.
ఈ వాదోపవాదములు దినక్రమమున బెరిగి బద్ధద్వేషము

లుగ బరిణమించెను. ఈ రిద్దరిమధ్యను వచ్చగడ్డివేసిన భగ్గున మండు పరిస్థితు లేర్పడినవి.

జయచంద్రున కొక పుత్రికారత్నము జన్మించెను. ఆమె సకలసద్గుణ సంయుక్త. సజ్జనానురాక్త. దుస్సాంగత్య విముక్త. ఆమె పేరు సంయుక్త.

ఆ రాకుమారి తగిన విద్యాదికముల నభ్యసించి, చక్కదనముల కెక్కుడై సాటివారిలో వన్నెకెక్కెను. ఆకన్యా రత్నమును వివాహమాడ నెందరో రాజకుమారు లువ్విళు లూరుచుండిరి. సాముద్రికులకు చేతుల జూపువారు కొందరు. జాతకచక్రముల పరిశీలింప జేసికొనువారు కొందరు. జ్యోతిష ప్రశ్నల నడుగువారుకొందరు. ఇట్లుండ వివాహోచితవయస్క యగు సంయుక్తకు స్వయంవరము చాటింపబడెను.

జయచంద్రుడు పెద్దయెత్తున స్వయంవరసన్నాహముల జేయించెను. దేశమునందలి నృపాలాత్మజుల కందఱకును సాహ్వానము లంపెనుకాని. తనకు బద్ధవిరోధియగు పృథ్వీసింగును మాత్రము పిలువనే లేదు. పిలువకున్న పోనీ, అంత టితో నూరకుండెనా ? సభామంటపద్వారమున పృథ్వీసింగు రూపము నొక దారువుపై చిత్రింపజేసి నిల్పెను. పృథ్వీరాజు నవమానింప దలంచి స్వయంవరాగతుల నాచిత్రముపై నుమ్మి వేయ నాజ్ఞాపించెను. అశక్తదుర్జనత్వ మన నింతకన్న వే రొండేమి కలదు ?

సంయుక్త బాల్యమున నొకప్పుడు తాతగారింట పృథ్వీ రాజును చూచెను. ఆ ముహూర్తబల మేదియోగాని నాటి పృథ్వీరాజమూర్తి సంయుక్తాదేవి హృదయమున హత్తుకొనెను. ఇది కేవలము దైవసంకల్పము. అట్లుకానిచో నా పసితనమున సంయుక్త హృదయము మా నరపతియం దనురక్త మగునట్లు? ఈ యనురాగలతిక వయసుతోపాటు వృద్ధి కాజొచ్చెను. దాచిపెట్టినను కసుము సౌరభ మణంగనట్లు, పృథ్వీ రాజు తనకు మరల కాన్పింపకున్నను, నాతని యుత్తమ గుణ సౌరభ మామెను జేరుచునే యున్నది.

జయచంద్రునకు బృథ్వీరాజు బద్ధవిరోధిగదా! ఈ ద్వేషవిషయము సంయుక్త యెఱిగియే యున్నది. తాను వలచిన పురుషుడు జనకునివిరోధి యగుట సంయుక్త కోరిక నెరవేఱుట దుస్సాధ్యముకదా! అట్లని యామె నిరుత్సాహపడ లేదు. విదుషీమణి; వీరకుమారి; ఉచితజ్ఞ; కార్యసాధన దక్షురాలు, ఇట్టియువతి యాత్మీయాభిలాషను సాధించుకొనకుండునా? తన వల్లభుడు జనకునిప్రత్యర్థి యని యెఱింగియు నాతనిదప్ప యన్యుని వరింపనొల్లనని చేసికొనిన యామె నిశ్చయము సాహసోపేతముగదా?

స్వయంవరమండపమున సకల నరవరాత్మజులు సుప్రవిష్టులై యుండిరి. ముహూర్త మాసన్న మగుచుండెను. ఇం

తలో సంయుక్త స్వయంవరోచిత వేషమున స్వయంవరమంట
పమున కేతెంచెను. రాజపురోహితులు వైదిక కర్మకలాప
ముల నిర్వర్తించిరి. అంత జయచంద్రుడు లేచి, కుమార్తెను
చేరఁజీరి "అమ్మా! వంశగౌరవమునకు వెలితి కాకుండ, నీ
యోగ్యతకు కళంకము కలుగనివిధమున, నిచట మూఁగియున్న
రాకుమారులలో నీ కనురూపు డగువానిని వరింపుము. నీనిర్ణ
యమును కాదనువా డెవ్వడును లేడు" అని పలికి రాకుమా
రులవృత్తాంతము నెఱిఁగింప విద్యావతి యగు శారద యను
చేటిని నియమించెను.

సంయుక్త ధవళకుసుమదామమును కేలఁగీలించి చేటిక
వెంట నడువసాగెను. శారద యొక్కొక్క రాకుమారుని సమ
గ్రముగ వర్ణించుచుండెను. ఆ యా వర్ణనలకు చెవి యొగ్గక
ముందున కడుగిడుచుండెను. ముందునకు బోవుచున్న సంయు
క్తను జూచి నిరాకృతులైన రాకుమారులు ముఖముల వ్రేల
వైచిరి. స్వయంవరాహూతులం దొక్కఁడేనియు నామెకు
నచ్చలేదు. ఆత్మహృదయాధిదైవత మగు పృథ్వీరాజా రా
కుమారులయందు లేమి సంయుక్త మనమల్లాడెను. తిరిగి పో
బోవుచున్న సంయుక్తకు కన్నులపండువగు పృథ్వీరాజుయొక్క
చిత్రము కనబడెను. అంత సంయుక్త వికసిత హృదయమున
శారదను జూచి, "చెలీ! ఆ చిత్రగతమూర్తి యెవ్వని" దని

యడిగెను. అందులకు శారద, "ఇంకేవరు! సర్వాతీతగుణగరి ష్ఠుడు; అనన్యసామాన్య పరాక్రమోపేతుడు; రూపజితరతి మనోహరుడు; పృథ్వీరాజు" అని చెప్పెను.

తిరిగి సంయుక్త యామూర్తిని కన్నార జూచెను. వెం టనే కండ్లనుండి జొటజొట బిందువులు రాలెను. అవి మనో హరమూర్తిని దర్శించుటవలన గలిగిన యానందాశ్రువులో, నిజజనకు డాతని కొనరించిన యవమానమును సహింపలేక కలిగిన దుఃఖాశ్రువులో నిర్ణయింపలేము. ఇంచుక నిలచి వెంటనే యా చిత్రమూర్తి గళమును తన చేనున్న ధవళ కుసుమదామముచే నలంకరించెను.

సభాసదుల దృష్టియంతయు నా సన్నివేశమున కేంద్రీ కరించెను. ఉడుకుబోతుతనమున రాకుమారులు జయచంద్రు నిపై గత్తుల దూసిరి.

జయచంద్రున కీ సన్నివేశ మంతయును గంగవెఱ్ఱు లెత్తించినది. తా నొకటి తలచిన దైవ మొకటి కావించెను. విధేయయగు నాత్మజాత యిట్టివిధమున తన కవమాన మొన రించునని యా మహీపతి కలనేని దలంపలేదు. కోపమున శరీరరక్త ముడుకెక్కినది. కన్నులెఱ్ఱవారినవి. "ఓసీ, నర రూపరాక్షసీ! పుత్రికా రూపమున నున్న గర్భశత్రువవు.

మా వంశసముద్రమున నుద్భవించిన యాదిలక్ష్మి వనుకొంటినిగాని హాలాహలమనని యెఱుంగనైతిని. ఛీ! అవాచ్యమగు నపరాధము నొకని వరించిన నీ కెట్టిశిక్ష విధింపదగునో తెలిసికొన్నది" అని యనరానిమాటల నని సేవకులదెసజూచి "ఈ దుష్టురాలి నీక్షణమున కారాగారమున నైపుము" అని యాజ్ఞాపించెను. రాజాజ్ఞ నిర్వర్తింపబడెను.

కారాగారాంతర నివాసిని యైన సంయుక్త నిరంతర పృథ్వీరాజనిహితచిత్తయై యుండెను. జయచంద్రుడీ హఠాత్సంఘటనమున కెంతయు గుందుచుండెను.

సంయుక్త స్వయంవరమున దన్ను వరించినవార్త విని పృథ్వీరా జానందించియు, తత్ఫలితముగ నామె చెఱయందుంచబడుట కెంతయు విచారించెను.

పృథ్వీరాజు తనసేనాని యగు ఆతతాయి నాయకత్వమున తగు బలముతోడ నాకస్మికముగ కన్యాకుబ్జనగరముపై దండెత్తెను. ఈ వార్త వినినంతనే జయచంద్రుడు కరహాకంఠీరవుని నాయకత్వమున బృథ్వీరాజుసేనల నెదుర్కొన నాజ్ఞాపించెను.

ఉభయపక్షములును భయంకరసంగ్రామ మొనరించుచుండెను. ఇరుపక్షములందలి సేనానులును సంగరభీములే ;

వ్యూహనిర్మాణధురీణులే ; ప్రతిపక్షభయంకరులే. కాని యా
నాటియుద్ధమున పృథ్వీరాజసైన్యము జయచంద్రసైనికసము
హమున నాగజాలకపోయినది. ఆతతాయి కరహాకంఠీరవుని
కరవాలమున కెర యయ్యెను. ఆ దెబ్బతో పృథ్వీరాజసైని
కులు వెనుకడుగు వేయక తప్పినదికాదు. పృథ్వీరా జీసమయ
మున కారాగారమునందున్న సంయుక్తను విడిపించు సంకల్ప
మున కొలదిసైనికులతో చెఱసాలవైపున నున్నకోటగోడను
భేదించుయత్నమున నుండెను తన సేనాపతి మరణించినవార్త
చెవిని బడినంత హుటాహుటి పృథ్వీరాజు కరహాకంఠీరవు
నెదుర్కొనెను. వారిరువురును బోరుచుండ పృథ్వీరాజు
నశ్వమునకు దూరమునుండి యొకబాణము వచ్చి తాకెను.
ఆ దెబ్బ కా తురంగ మటునిటు తూగా, సదియ తగినయద
నని పృథ్వీరాజును వధింప కరహాకంఠీరవుడు తనకృపాణమును
పైకెత్తెను. ఇంతలో నొకయాశ్వికు డాతని వెనుకనే వచ్చి
కరహాకంఠీరవుశిరమును శరీరమునుండి తొలగించెను. ఆదెబ్బ
తో యుద్ధము ముగిసినది. జయచంద్రునిసేనలు పలాయన
మంత్రమును పఠించినవి. పృథ్వీరాజు తనసేనలతో స్కంధా
వారమునందలి నిజ శిబిరమున కేగెను. ఆశ్చర్యము ! తన
మరాలో సంయుక్త ప్రత్యక్ష యయ్యెను, కరహాకంఠీరవునికత్తి
వాత బడనున్న పృథ్వీరాజును రక్షించిన దీ వీరనారియే.

ఆ వృత్తాంత మంతయు నాతడు వినిపింప పృథ్వీరాజాశ్చర్య చకితు డయ్యెను.

జయచంద్రుడు తా నల్లారుముద్దుగ బెంచిన కుమార్తె తన్నవమానించుటకే కుళ్ళిపోవుచుండెను. దానికిదోడు యుద్ధమున పరాజయము. దానిపై సంయుక్త తప్పించుకొని పోయి పృథ్వీరాజును చేరుట. ఇట్లొకదాని వెనుక నొకటిగా సంభవించిన యవమాన పరంపరల సహింపలేకపోయెను. సహింపక చేయగలిగిన దేమియు లేదు. తానా బలాఢ్యుడగు పృథ్వీరాజు నెదిరించి జయించుట కల్ల. పృథ్వీరాజు సజీవుడై యుండ తాను సుఖించుట గగనకుసుమము. తన వైరము మరణముతో దీరవలసినదియే. కాన పృథ్వీరాజును జయించు సాధనము లాలోచింపసాగెను.

ఇంతకుమును ఎన్నియో తడవలు మహమ్మదు గోరీ యను నాఫ్ఘనుసరదారు డొకడు సకలసంపత్సంపన్న మగు భారతదేశమును దోచుకొనిపోవుట కపార సైన్యములతో వచ్చి పరాభూతుడై పోయెను. పృథ్వీరాజు పేరనిన వానికి సింహస్వప్నము. ఈ పరిస్థితుల నన్నియు బర్యాలోచించి జయచంద్రు డొక తంత్రమును నడుప నమకట్టెను. గోరీకి తానును, మరికొందఱు రసపుత్రులును తోడ్పడుదుమనియు,

తప్పక ఢిల్లీపై దండెత్తుమనియు బ్రోత్సహించుచు గూఢ చారులమూలమున వానికి వార్తనంపెను. తనకు తగిన సహాయము లభించుటకు గోరీ చంకలు కొట్టుకొని, వెంటనే తన యంగీకారమును తెలియజేసెను.

ఈలోపున తనవలె వివేకశూన్యులగు మఱికొందఱు రాజులను తనసైన్యమునకు త్రిప్పుకొని జయచంద్రుడు యుద్ధ సన్నాహములు చేయసాగెను.

జయచంద్రుడు రాజపుత్రవీరులతోగూడి యసంఖ్యాకమగు సైనికబలముతో బయలుదేరి యమునానదీతీరమున విడిసెను. గోరీయును తగు సైనికులతో గూడి దండయాత్ర సాగించెను.

పృథ్వీరాజున కిది యంతయును దెలిసెను. జయచంద్రాదుల యజ్ఞానమున కెంతయో పరితపించెను. సాటిరాజపుత్రు లన్యోన్యవైరముల బెంచుకొని, దేశమును దుర్బలము జేయుట కూడనిపనియని విచారించెను. పరదేశీయుల మాతృభూభాగము నాక్రమింపజేయనీయని వీరు లన్యోన్య కలహములలో దిగుట దేశానర్థహేతువని తలంచెను, ఇట్లెంతయో యాలోచించి జయచంద్రుని, తదనుయాయులను సంగరపరాఙ్ముఖులను గావింపదలంచి రాయబారార్థము సంయుక్తను నియోగించెను.

వెంటనే సంయుక్త పురుషవేషధారిణి యై, అశ్వారూఢయై జయచంద్రుని స్కంధావారమును జేరి యమునానది తీరమున ప్రాతఃకాలకృత్యముల నొనరించుకొనుచున్న జనకుని జేరెను.

పురుషవేషమున నున్న కుమార్తెను జయచంద్రుఁడు గుర్తింపజాలకపోయెను. అప్పు డామె తన్నెఱిగించుకొనెను. వెంటనే జయచంద్రుఁడు తోకద్రొక్కిన త్రాచువలె బుస్సున లేచి "ఓసీ! కులపాంసనీ! నేను నీకు తండ్రినా? ఛీ, కృతఘ్నురాలా! నీ పాడుముఖమును నాకు జూపుటకు సిగ్గులేదా? చాలుజాలు - పొమ్ము"అని నిందించెను.

తండ్రి తన్నాదరించు నని యామె తలంచివచ్చెనా? తన కట్టిగౌరవమే తండ్రివలన గలుగునని యామె ముందుగనే యెఱింగి, ప్రాణేశ్వరు నాజ్ఞాబలమును, దేశాభిమానమును, దన్ను బ్రోత్సహింప నీ దౌత్యభారమును వహించి వచ్చెను. ఆకారణముననే తండ్రియొక్క వాక్యములను బాటింపక మరల నిట్లనియె.

"తండ్రీ! నా తప్పులను మన్నించి నా వినయపూర్వక విజ్ఞప్తిని దయాపూర్వకముగ నాలింపుడు. పదంపడి మీ యభిమతానుసారమే మెలంగుడు. పృథ్వీరాజును మీరు బద్ధవిరోధిగ నేల భావించుచుంటిరో నే నెఱుంగజాలకున్నాను.

తాతగా రిచ్చిన ఢిల్లీసింహాసన మాతని యధిష్ఠించెనే గాని, మీ సొత్తును నాతఁడు బలాత్కారముగ గ్రహింపలేదు. పృథ్వీతోఁ పోరాటమున కశక్తుఁడవైన నీవు, నా స్వయంవరమంటపద్వారమున నా భూజానిమూర్తిని బ్రతిష్ఠింపఁజేసి, స్వయంవరాగతులచే దానిపై నిష్ఠీవనము సేయించు నింతటి నీచకార్యమో క్రోధవివశుండవైన నీవు గుర్తింపనైతివి. ఇక నా స్వయంవరవిషయమున నేను కావించిన యపరాధ మేదియో నే నూహింపజాలకున్నాను. క్షత్రియకన్యక తన యిచ్ఛవచ్చిన రాకుమారుని జేపట్టుటే గదా స్వయంవరము! అందువలన గుణాగణ్యుఁడును, బలధుర్యుఁడును, యశోమూర్తియును నగు రాకుమారుని వరించితినే గాని యొక అనామకునిగాదే! కానిమ్ము; ఇవన్నియు నీబుద్ధికి దోషములుగ కన్పించుట మా పాపఫలముగాని వేరొండుకాదు. ఇప్పుడు ముఖ్యముగ మీకు జెప్పునదేమన, మనలోని విభేదములను మనమే సర్దుకొనవచ్చునుగదా? విదేశీయు నాహ్వానించితివే? ఇది కొఱవితో తలగోకుకొనుటవంటిది. ఈ సంగ్రామమున జయాపజయముల మనము నిర్ణయింపజాలము గదా! దైవవశమున మేము పరాజితులమైనను నీ వద్దాన నందెడిలాభ మనుమాత్రము నుండబోదు. మమ్ము నిర్జించిన యా యాఘోరుసర్దారును నిన్ను మన్నించు నని తలంచుట పట్టిభ్రమ. పవిత్ర

క్షత్రియవంశమున జన్మించిననీవు, క్షత్రియధర్మబాహ్యమైన కర్మము నవలంబించుట కంటె దురవమానము నేనా చెప్పవలసి నది? కావున పరిశాంతచిత్తమున నాలోచించి నీవు గోరీతో కలిసిపోయి భారతభారత ప్రజానీకముయొక్క యపధనా నముల నాపుము" అని చెప్పెను.

ఈ మాట లన్నియు నాలించి జయచంద్రుడు సిగ్గై "ఛీ! నీ హితోపదేశములతో నా కెట్టి నిమిత్తమును లేదు. నీ వంటి జనబాహ్యులను నీచునిగాని, నిన్నుగాని నేను మన్నింప జాలను. భారతదేశమున కేగతి పట్టినను నాకు చింత లేదు. నా మనస్సునకు శాంతి యనునది పృథ్వీరాజశిరమును రణ భూమిని నేత్రపర్వముగ గాంచిననాడే. పొమ్ము! నా యెదుట నిలువకుము" అని పలికెను. అంత సంయుక్త, "నేనుగాని, నా మనోహరుడుగాని ప్రాణముల కాసపడించి నీ దగ్గఱకు రా లేదు. మా పరాజయమునకు మేము శంకింపము. గోరీ విజ యము భారతీయజన దాస్యమునకు బీజము. భారతమాతను దాస్యశృంఖలముల జిక్కించి, జగంబున శాశ్వతం బగు నప కీర్తిపా లగుదువే యని నా యామావేదన. ఇదియే నా కడసారి ప్రార్థనము. ససైన్యముగ మరలిపొమ్ము. నీకు మాపై గల విరోధమును కాలక్రమమున నేదోవిధముగ సాధించుకొను ము" అని చెప్పి తన యాజనేయము నెక్కి శీఘ్రగమనమున విజనగరున కేగెను.

పృథ్వీరాజు జరిగిన వృత్తాంతమంతయును విని, జయచందున్ని సంకుచితబుద్ధి కెంతయు వగచి, దైవమలంఘ్యమని నిశ్చయించి, తానొక సైన్యభాగమును వెంట నిడుకొని ఘోరీతోడి యుద్ధమున కేగుటకును, మిగిలిన సేనాసమితితో సంయుక్త జయచంద్రునితోడి యుద్ధము జేయ బంపుటకును నిశ్చయించి తన యభిమతము నర్ధాంగి కెఱిగించెను.

సంయుక్తయు విభుని యాజ్ఞ నౌదల దాల్చెను. దంపతు లిరువురును నిర్దిష్టవిధమున యుద్ధాభిముఖులై చనిరి. సంయుక్త పురుషవేషమున సేనల నడిపించుచు రెండుదినములు ఘోరముగ పోరెను. మూడవనాటి యుద్ధమున నయోధ్యరాసుతుడు వెనుకపాటున వచ్చి యామెవీరనారిదక్షిణహస్తమును ఖండించెను. వటువడిన యాంసుపులివలె నామె పత్ని "ఛీ! పురుషపశువా! ఇదియా నీ వీరలక్షణము? దొంగపోటున వచ్చి చేయి దునిమితివే?" యని యనుచునే వామహస్తమునగల శూలమున నొక్కపోటు పొడిచెను. దానితో నాత "డయ్యో" యని నేలబడి ప్రాణముల విడిచెను.

వెంటనే సంయుక్త తనశిబిరమున కేగి, తన నాథున కొక లేఖను వ్రాసెను.

నాథా!

నేను యథాశక్తి పోరితిని. కుడిచేయి తెగినది. అది యొకనీచుని ఘోరకార్యము. వానిని వధించితిని. ప్రాణము లెగిరిపోనున్నవి. నాకై విచారింపక, తుది సమరము పోరుము. మన యన్యోన్యసమాగమము వీర స్వర్గములోనే. ఇవే నా ప్రణామములు.

ఇట్లు,
మీ చరణదాసి,
సంయుక్త.

ఏ తల్లేఖానవాహుడు పృథ్వీనరేంద్రచంద్రుని జేరునప్పటికే సంయుక్త స్వర్గసీమ నలంకరించెను. అక్కడ గోరీ పరాజయభీతితో సంధిచేసికొనెను. ఇంతలో పృథ్వీరాజు సేవకుని చేతి లేఖను తిలకించి శిబిరమును జేరి దుఃఖసముద్రమగ్నుడై యుండెను. "సంయుక్తా! నన్ను వరించుట మృత్యువును వరించుట యైనదే! నీ వనుభవించిన సుఖలేశమును లేదా? కానిమ్ము; నీయాత్మకు శాంతి కలుగుగాక! అచిరముననే నిన్ను చేరెదను" అని పలవించెను.

జయచంద్రుని విజయవార్తలు గోరీ కండెను. సంధి నియమముల నుల్లఘించి, కళత్రవియోగసంతప్తుడైన పృథ్వీనరపతిని మాయోపాయమున గోరీ బందీకృతుని జేయించి,

తన సముఖముననే కన్నుల బెఱికించి చెఱసాలలో వైచెను. ఆ కారాగారముననే యా నరపతి యాత్మహత్య గావించుకొనెను. స్వర్గభూమిని తనరాక కెదురుచూచుచున్న సంయుక్తను గూడి దివ్యసౌఖ్యముల ననుభవించెను.

ఘోరీ ఢిల్లీరాజ్యము నాక్రమించుకొని జయచంద్రుని నిర్బంధింప నాజ్ఞాపించెను. ఈవార్త జయచంద్రుని కెఱుకవచ్చెను. తన తనయ మాటలొక్కపరి హృదయమున జ్ఞాపకమున మెరసెను. కుమార్తెను దలంచి యశ్రుపూర్ణుడై యొనర్చి యమునానదిలో బడి మృతి నందెను.

ఈ విధముగ రెండు రాజవంశములు నిర్మూలములై భారతభూమి పరభూపాల హస్తగతమై పోయెను.

చూచితిరా! ఒక్క మూర్ఖనరపతి చేసినదోసమున స్వతంత్రము దేశము నెట్టి యధోగతిపాలొనరించినదో!





# 7. తెనాలి రామకృష్ణుడు

ఆంధ్రభాషాచరిత్రలో పదునైదవ శతాబ్దము సువర్ణయుగమని చెప్పవచ్చును. ఏ భాషాచరిత్రను చూచినను నొక్కొక్క కాలమునం దొక్కొక్క ప్రభుత్వాదరణమున సర్వతోముఖముగా నా భాష యభివృద్ధి నందినట్లు తెలియుచున్నది. అట్లే మన తెలుగుతల్లి కమూల్యాలంకారము లేర్పడిన దినము లవి.

ఆకాలమున శ్రీకృష్ణదేవరాయలు ప్రభువు. ఆతడు తెనుగుభాషామతల్లికి యొనరించిన సేవ యసదృశము. ఆమహానీయుని యాలంబనమున తెనుగుకవులు తమ యపూర్వరచనలను సాగించిరి.

ఆ నాటి కవిపుంగవులలో సువిశాల యశస్సంపన్నుడు తెనాలి రామకృష్ణకవిపుంగవుడు.

తెనాలి రామకృష్ణుడే, రామలింగడని వ్యవహరింపబడువాడు. ఈ రామలింగకవి పేరు వినని తెలుగువారలు లేరనుట వింతవిషయము కాదు. అతనినిగురించిన కథలెన్నియో మనయాంధ్రదేశమున బ్రచారమున నున్నవి. ఈ కథలన్నియును కడుపుబ్బ నవ్వు పుట్టించునవి. అందు చాలనియుక్తులు ఆ మహాకవికిగల లోకజ్ఞానమునకు దగిన యుదాహరణములు.

రామలింగకవి జన్మవృత్తాంత మాతడు రచించిన పాండురంగమాహాత్మ్యమున గలదు. ఇతడు కృష్ణామండలములోని గార్లపాడను గ్రామమునందు జనన మందెను. తండ్రి రామయ్య; తల్లి లక్ష్మమ్మ. కులమున నియోగిశాఖకుజెందిన బ్రాహ్మణుడు. పాప మీతనికి బసితనముననే తల్లిదండ్రులు కఱవైరి. ఆ కారణమున నితడు తెనాలిలోని మేనమామ యింటనే పెరిగెను. ఇతని యింటిపేరు తెనాలివారు.

తల్లిదండ్రులు గతించుటయు, మేనమామ పోషణకర్త యగుటయు గారణముగ చిన్ననాటినుండియు నిచ్చవచ్చిన యిచ్చవచ్చిన విచ్చలవిడి సంచరించుట కలవడెను. చదువుసంధ్యలు లేకుండెను. అల్లరిపిల్లల సహవాసమున కొంటె కోణంగిగా నయ్యెను. అదుపాజ్ఞలలో పెరుగనివా డగుటచేత భయభక్తులు సున్నయైనవి.

ఎప్పటివలె సీత ఊరిబయట గుట్టలలో తిరుగుచు నాడుచుండెను. దైవవశమున నాదారి నొక సిద్ధుడు పోవుచుండెను. అత డీబాలుని జూచి, "ఈతనికి గొప్పదశ రాగలదు. ముఖలక్షణములు తెలివితేటలను సూచించెడిని" అని తలంచి యాబాలుని దగ్గరకు బిలిచెను. రామలింగ డాతని చెంతకేగి 'అయ్యా! నాతో నీకేమిపని యున్నది?' అని యడిగెను. అంత నా సిద్ధుడు రామలింగనిజూచి "నాయనా! నేను నీకొకమంత్ర ముపదేశించెదను. దానివలన నీవు మిక్కిలి గొప్పవాడ వగుదువు. కావలెనా?" అని యడిగెను. అందులకాతడు "స్వామీ! ఆమంత్రమును చెప్పుండి. మీరు చెప్పినట్లుగ చేయుదును" అనెను. అప్పు డాసిద్ధు డాతనికి కాళికా మంత్రము నుపదేశించెను. మంత్రోపదేశము నందిన రామలింగ డాసిద్ధునకు నమస్కరించి యా మంత్రము ననుష్ఠించు విధము నంతయు నాతనివలన నెఱింగెను.

అనంతరము రామలింగడు సిద్ధోపదేశానుసారముగ మంత్రపునశ్చరణ కారంభించెను. చెప్పిన చొప్పున నియమము దప్పక పునశ్చరణ మొనరించు రామలింగని కొకనాటిరేయి కాళికాదేవి ప్రత్యక్షమయ్యెను.

అంత నాయంబ, "కుమారా! నీ భక్తిప్రపత్తుల కెంతయు సంతసించితిని. నీకు వరమిచ్చుటకు వచ్చితిని. ఇదిగో, నా యెడమచేతనున్న పాత్రలోనివి క్షీరములు. ఈపాల ద్రాగితివేని గొప్పకవి నయ్యెదవు. రసవత్తరములగు కావ్యములు రచింపగలుగుదువు. ఈ నా కుడిచేతనున్న పాత్రమును జూడుము; ఇది దధి. దీని ద్రాగితివేని నీకు విశేషైశ్వర్యము లభించును. మహారాజతుల్యభోగముల ననుభవింతువు. చెప్పుము నీ కీ రెంటియం దేదికావలయును?"

దయారసము ప్పతిల్లబల్కు నా జగన్మాత పలుకుల కలరి రామకృష్ణుడు కాళికాదేవికి సాష్టాంగనమస్కార మొనరించి, తల్లీ! నీ చేతియందలి పాత్రలను బరీక్షింపనిమ్ము. అప్పుడుగాని నేను నిర్ణయింపజాలను" అని యడుగ నాలోకజనని 'వల్లె' యని యా రెండుగిన్నెల నాతని కందించెను. వెంటనే రామకృష్ణు డా రెండుపాత్రముల నొక్కుమ్మడిగ ద్రాగెను. ఆతనికృత్యమున కక్కజపడి యా కాళికాదేవి కోపమున "ఓరీ! నా యెదుటనే నీ వి ట్లవినయమున బ్రవర్తింతువా

శపించెదను చూడుము” అని యనుచుండగనే రామకృష్ణుడు “తల్లీ! బిడ్డల నేరముల మన్నించి తల్లియే కడుపులో బెట్టుకొనకున్న నిక వారలగతియేమి? కంచెయే చేను మేసిన కాపుగతియేమి? నీకోపము నాపైననా చూపునది?” యని వేడుకొన నాయంబ దయాంతరంగితాంతరంగ యై యాగ్రహము వీడి యనుగ్రహించి యాతని కిట్లనియె. “రామకృష్ణా! నీవు కవిలోకమున పేరెన్నిక గలవాడ వగుదువు. నరపతుల మన్ననల నందుదువు. సమస్తైశ్వర్యముల ననుభవింతువు కాని నీవు వికటకవి వయ్యెదవు.” ఈ మాట లాడుచునే నా జగద్ధాత్రి యదృశ్యురా లయ్యెను.

పరమేశ్వరీకటాక్షము లభించినవాని కేలోటుకలదు? ఆతనినాలుకపై నలువరాణి నాట్యమాడెను. అనర్ఘళ కవితాధార 'యేర్పడెను. చదువుమొగ మెఱుగని రామకృష్ణుడు మహాకవిగ మారిపోయెను. భగవంతుని లీల లద్భుతములు గదా!

రామకృష్ణు డంత శ్రీకృష్ణరాయ భూజానిని దర్శించి తన కవితావిలాసమున నాతని మెప్పించి యాతని యాస్థానమున నుండ నూహించెను. పండితులు, వనితలు, లతలు ఆశ్రయములేక శోభించ రను పండితవాక్యము ననుసరించి, తాను రాయలయాశ్రయము నభిలషించెను. ఎన్నటికేని మహదాశ్రయమే కర్తవ్యముకాని నీచాశ్రయము కూడదు.

రామకృష్ణుడు రచించిన గ్రంథములలో మొట్టమొద
టిది యుద్భటారాధ్యచరిత్రము. అనంతరము పాండురంగ
మహాత్మ్యమును, ఘటికాచలమహాత్మ్యమును రచించెను.
ఈతడు పాండురంగవిజయమునుకూడ రచించె నని కొందఱు
పండితు లనుచున్నారు. ఈ గ్రంథములనేగాక రామకృష్ణకవి
కందర్పకేతు విలాసము; హరిలీలావిలాసము అను గ్రంథము
లనుగూడ రచించినట్లు తెలియుచున్నది. కాని యీ గ్రంథ
ములయం దిప్పుడు పాండురంగమాహాత్మ్యమును, ఘటికా
చల మాహాత్మ్యమును మాత్రము లభించుచున్నవి. మిగిలి
నవి నామావశిష్టములై యున్నవి. ఆంధ్రభాషాప్రపంచమున
నెన్ని యమూల్య గ్రంథములు కాలగర్భమున కలిసిపోయి
నవో! ముద్రణాదిసౌకర్యములు లేని యా కాలమున నిట్టి
యుద్గ్రంథము లెన్నియో నశించియుండును. ఏ కొన్నియో
మఱుగుపడి యుండును.

కావున నీనాటి విద్యార్థులు బాగుగ భాషాపరిశ్రమను
జేసి, ప్రాచీనకవులగ్రంథములను సంపాదించి ప్రకటించుటకై
యత్నింపవలయును. అట్టి భాషాసేవ మీ కందఱకు లభించు
గాక!



